ఆగస్ట్ '72

35

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక



# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

35

ఆగస్టు 1972

నిర్వహణ
'సాహితీమిత్రులు'

84 పేజీలు 1 రూపాయి

ముఖచిత్రం :

శంఖారావం సౌజన్యంతో 63 వ పేజీ చూడండి

ప్రతులకు, వివరాలకు :

సృజన

హనుమకొండ

వరంగల్-1 (ఆం.ప్ర.)

విడిప్రతి: ఒక రూపాయి

అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు

సంవత్సర చందా: పది రూపాయలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Wide Re. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-2 (A.P.)

# సృజన

అధునిక సాహిత్యవేదిక

1972 ఆగస్టు మాసపత్రిక 35

# "ఇప్పుడు వీస్తున్న గాలి"

ఇప్పుడు వీస్తున్న గాలి
మంత్రిగారి ఎయిర్‌కూలర్‌కు చల్లబడదు
హీరోయిన్ హ్రీనితంబాలు ముద్దాడదు
శాసనాల బెడ్డముక్కలకి తగిలి ఆగిపోదు

ఇప్పుడు వీస్తున్న గాలి
పాలికాపు నుదుట చెమట ఆరుస్తుంది
భూస్వాముల పాలబడే రైతు కన్నె
శీలానికి కవచంలా నిలబడుతుంది
పర్వతాలను బద్దలుకొట్టి లావాని వెదజల్లుతుంది
బడివదిలిన పిల్లోడికి బుల్లెట్ సందిస్తుంది

ఇప్పుడు వీస్తున్న గాలి
నిషేధాలను దాటుకుంటూ
తూరుపు నింగిని ఎర్రనై
తూరుపు నేలనుంచి
సరికొత్త రాగాల్ని
సమస్త విశ్వాన్నాలాపిస్తుంది.

— అప్పాజీ

నవల:

# నా కుటుంబం

టావ్‌చెంగ్

(గతసంచిక తరువాయి)

రాత్రింతా చెదురుమదురుగా కాల్పులు జరుగుతూనే ఉన్నాయి. మై-షెంగ్ తన కామ్రేడ్ల రక్షణగురించే ఆందోళనపడ్డాడు. దిగులుగా గదిలో అటూ ఇటూ పచార్లు చేశాడు. బయటకు పోవడానికి ప్రయత్నించిన ప్రతిసారీ వారించాను.

"ఆ పత్రాన్ని బయటికితేవడానికి ఇంకా కొందరు కామ్రేడ్లు అక్కడ ప్రయత్నిస్తూనే ఉన్నారు."

"నీవొక్కడివే వారిని కాపాడగలవనా నీ ఉద్దేశం"

మై-షెంగ్ మాట్లాడలేదు.

కాల్పులచప్పుడు అన్నివైపులనుండి వస్తున్నట్లనిపించింది. దూరంగా కనుచూపుమేర అంతా అరుణకాంతితోనిండిన మంటలు మా కిటికీనుండి కనిపిస్తునే వున్నాయి. బజార్లలో మధ్యమధ్య అటూ ఇటూ పరుగెడుతున్న అడుగులచప్పుడు, పిల్లల ఆడవాళ్ల ఏడుస్తున్న హృదయవిదారకమైన కీచుగొంతులు వినవస్తున్నాయి. తెలతెలవారుతుండగా పరిస్థితి కొంచెం శాంతించింది రాత్రికి రాత్రే మై-షెంగ్ ముసలివాడైనట్లనిపించింది. కండ్లు లోతుగా పీక్కుపోయాయి, నుదుటిముడతలు స్పష్టంగా మరీగాఢంగా అయ్యాయి. కాల్పులు ఆగగానే బయటికురికాడు.

ఆ ఒక్క రాత్రిలోనే చాంగ్‌షా భయంకర నగరంగా తయారైంది. వీధుల్లో, సందుగొందుల వెంట, ఉత్తర దక్షిణ గేట్ల చుట్టు ఎక్కడ బడితే అక్కడ శవాలు పడి ఉన్నాయి. పెద్ద పెద్ద నల్లని అక్షరాల్లో అరెస్ట్ కాబోయే వాళ్ల పేర్లున్న పోస్టర్లు గోడలపై అంటించబడ్డాయి. ఆ లిస్టులో "అమాయక ప్రజలను హత్యజేసిన తీవ్ర (హింసా) వాది" అయిన ఉయాంగ్ మై-షెంగ్ పేరు కూడా ఉంది.

చివరకు నేను భయపడ్డంతా జరిగింది. అంతకు కొద్ది రోజులకు పూర్వమే జరిగిన మా యిరువురి సంభాషణ జ్ఞాపకం చేసుకున్నాను. నేను ముందుకు సాగవలసిన మార్గం నా ముందే పరచుకొని ఉంది. ధైర్యంగా ముందుకు పోవడానికే నిశ్చయించుకున్నాను.

లి-యాన్ ఇంటికి తిరిగి వచ్చాడు చల్లగా.

'అమ్మా, నాన్నను అరెస్ట్ చేస్తామని ఉన్న పోస్టర్లు అంటించినట్లు తెలుసా నీకు?' అని దిగులుగా అడిగాడు.

నేను గంభీరంగా ఉండడానికి ప్రయత్నించాను.

'తెలుసు అబ్బాయి. నాన్న మేలు తప్ప ఎవరికీ కీడు చేయలేదు. అందుకే ఈ అభివృద్ధి నిరోధకులు ఆయన్ను అరెస్టు చేద్దామనుకుంటున్నారు. దీంట్లో భయ పడవలసిన పనేలేదు'.

ఇక నగరంలో ఉండటం ఎంతమాత్రమూ సంభవం కాదనీ, పార్టీ కూడా ఆ ప్రదేశం వీడి మరేదైనా చోటికి వెళ్లవలసిందిగా తన్ను ఆదేశించిందనీ ఇంటికి రాగానే చెప్పాడు మై-షెంగ్. ఆ రాత్రి ఆయన బట్టలన్ని ఒక చిన్న సంచీలో సర్ది పెట్టాను.

'కొద్ది రోజులవరకూ ఇబ్బందిగానే ఉండవచ్చు. తరువాత అదే సర్దుకుంటుంది' నాకు ధైర్యం చెప్పడానికని అన్నాడు. "కొద్ది రోజులు ఒక మిత్రుని ఇంటిలో ప్రచ్ఛన్నంగా ఉంటాను. అవకాశం చిక్కగానే వుహాన్ వెళ్తాను. నువ్వేమీ భయపడకు. వాళ్లు నన్ను పట్టుకోరులే. ఒకటి రెండు రోజుల్లో ఎవరైనా వచ్చి ఇక్కడి నుండి వెళ్లిపోవడానికి నీకు సహాయం చేస్తారు పరిస్థితులు మారేంతవరకూ నేను మిమ్మల్ని చూడలేక పోవచ్చు. అంటే బాధ్యత యింకా పెరుగుతుందన్నమాట. ధైర్యంగా పట్టుదలగా ఉండు. మళ్లీ మన అరుణ పతాకం ఎగిరేరోజు వస్తుంది".

పిల్లల్ని ముద్దాడి, సంచి చంకలో పెట్టుకొని నిశ్శబ్దంగా జారుకున్నాడు ఆయన పోవడం చూచి మనసులో బాధ, వేదన ఉవ్వెత్తున లేచాయి. పోరాటం ఎంత క్లిష్టమైంది! విప్లవ వ్యతిరేకులు ఓడిపోయేంత కాలం ప్రజలు బాధపడవలసిందే. ఈ విషయం అర్థమైన తరువాత మై-షెంగ్ నాకు మరీ ఆత్మీయుడుగా కనిపించాడు. పది సంవత్సరాలు కలసి మెలసి ఉన్నా ఆయన్ని, ఆయన కార్యక్రమ ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకొంది చివరి కొద్ది రోజుల్లోనే. ఇటువంటి తరుణాన విడిపోవలసి వచ్చింది. మళ్లీ ఏనాటికైనా తిరిగి కలుసుకో గలమో లేమో ఎవరు చెప్పగిలరు.

"రామ్మా.... లోపలికి పోదాం" గొంతు తగ్గించి అన్నాడు లి-యాన్.

ఇంతసేపూ నా వెనుక వాడున్నట్లే తెలియదు. నా కొడుక్కు నా బాధల్లో ఎట్లా సహకరించాలో తెలుసుననే విషయం స్ఫురణకు రాగానే నాలో ఒక కొత్త బలం వచ్చినట్లయింది. వాళ్ల తల్లి ఎంత ధైర్యవంతురాలో నా పిల్లలకు తెలియజేయాలి. లి-యాన్‌ను గట్టిగా పొదివి పట్టుకొని అన్నాను.

"అబ్బాయి, మనం ధైర్యంగా ముందుకు సాగుదామిక".

విప్లవ ప్రతీఘాతుకులు చాంగ్‌షాలో విజృంభించారు. పెద్ద భవనాల నెన్నింటినో ఫిరంగులతో నేలమట్టం చేశారు. ఆ ఇండ్ల వారికి పిల్లలతోసహా అడుక్కుతినే గతి పట్టింది. పాఠశాల లన్నింటిమీదా దాడి జరిపి మూయించారు. హాస్టల్ విద్యా

ర్థులను హాస్టళ్ల వీడి పొమ్మన్నారు అరెస్టులు, మరణ శిక్షలు ముమ్మరంగా సాగినై. సున్ యత్ సేన్ పద్ధతిలో దుస్తులు ధరించడం గాని, కత్తిరింపు జుట్టు ఉంచుకోనడంగాని చేసిన వారిని కమ్యూనిస్టుగా అనుమానించి అరెస్టు చేయడమో, కేసు నడుపకుండానే చంపడమో చేశారు. ఒక పోస్టర్ అతికించడంగాని, తీసివేయడంగానీ చేసిన వారిని హత్య చేశారు. అభివృద్ధి నిరోధక సైనికులు చేతులకు తెల్లపట్టీలు కట్టుకొని తెల్ల జండాలు పట్టుకొనేవారు. యూనిఫారంలో ఉండికూడా జండా లేకపోతే అక్కడి కక్కడే కాల్చేసేవారు. సుంకెయాంగ్ ఆధిపత్యంలో నున్న కోమింటాంగ్ పార్టీ రక్షక కార్యాలయం సంస్థ ఒక పాట రాసి అమాయక పిల్లలకు బజార్లలో పాడడానికి నేర్పించింది. పాట ఇట్లా ఉంటుంది.

> క్రూరంగా, భయంకరంగా ఉండ సాహసించకు
> లేబర్ యూనియన్ !
> 33వ రెజిమెంటు బాంబులు కురిపిస్తుంది. జాగ్రత్త !
> కర్షక సంఘం !
> క్రూరత్వానికి తెగబడ్డావా
> తలలెగిరి పోతాయి.

వర్షాకాలం ప్రవేశించింది. రోజుల తరబడి మబ్బుగా ఉంది. మై-షెంగ్ ఎక్కడికి వెళ్లాడో ? నేనొక్కదాన్నే ఈ పిల్లల్ని ఎట్లా పోషించాలి అంటూ నాలో నేనే తలపోసేదాన్ని. చినుకులుపడ్డ కిటికీ నుండి బయటకు చూస్తుంటే మై-షెంగ్ వెళ్లిపోయేనాడన్న మాటలే స్ఫురణకు వచ్చాయి. "మళ్లీ మన అరుణ పతాకం ఎగిరే రోజు వస్తుంది." అవును, ఆయన అన్నది వాస్తవమే. పరిస్థితు లెంత విషమించినా సరే నేను ధైర్యంగా ముందుకు సాగడం ఖాయం.

## 5

కొద్ది రోజుల్లోనే నేనొక మారుమూల ప్రాంతానికి తరలి వెళ్లేటందుకు సహాయ పడడానికి పార్టీ ఒకరిని పంపింది. పుస్తకాలన్నీ పాతవై చినిగిపోవడంతో పిల్లలకు పాఠాలన్నా, పాఠశాలన్నా అభిరుచి తగ్గింది. పోగా నేనే ఏమైనా ప్రమాదం వాటిల్ల వచ్చుననే భయంతో బజార్లకుగానీ పాఠశాలలకుగానీ పోనిచ్చేదాన్ని గాదు. శత్రువేమో చిన్న పిల్లలైనా సరే ఏదైనా నోరు జారితే నిర్దాక్షిణ్యంగా చంపేవాడు. విప్లవ ప్రతీఘాతుకు లందరిలోనూ కర్షకులంటే 'దొంగల'నీ, శ్రామిక వర్గానికి కేవలం 'హింస దౌర్జన్యం' మాత్రమే తెలుసుననే తప్పుడు అభిప్రాయం బలపడింది. ప్రతివాడూ తమ శత్రువుగానే కనిపించాడు.

ఒకసారి ఏదో కొనుక్కు రావడానికి లి-యాన్‌ను బజారుకు పంపాను. కొద్ది సేపట్లోనే వాడు ఒగరుస్తూ కలవరపాటుతో తిరిగి వచ్చాడు.

"నేను వుహాన్‌కు వెళ్లాలి. దీన్నెంతమాత్రమూ సహించలేనిక" అన్నాడు.

"ఏం జరిగింది?" అన్నాను. ఏదో తీవ్ర సంఘటనే వీణ్ణి ఇంతగా కలవర పెట్టి ఉంటుంది.

"మా సార్‌ను హత్య చేశారు" అంటూ ఏడ్చాడు.

నాకేం చేయడానికీ తోచక తల నిమురుతూ ధైర్యం చెప్పాను.

"నేను వెళ్లి నాన్నను కలుసుకోవాలి. వాళ్ల నెదుర్కోవాలి".

నాకెంతో దుఃఖము కలిగింది. గత మాసంలో వాడూ నా అంతగా కష్టపడ్డాడు. ఇంకా పిల్లవాడే ఐనా అనుభవం వల్ల బుద్ధి వికసించింది.

"ఇక్కడి పరిస్థితులు కూడా నాకేమీ నచ్చడం లేదు: మరి వుహాన్‌లో ఎట్లా ఉందో చెప్పలేం. మీ నాన్న అక్కడ సరిగా కుదురుకున్నాడో లేదో. మనం హఠాత్తుగా వెళ్లడమంటే ఆయన్ను కష్టాల్లో ఇరికించడమే. ఇంకొద్ది రోజులు ఓపికపడ్దాం. నువ్వు చూచింది మరువకు. ఇంత రక్తపాతమూ అనవసరంగాకాలేదు. ఎటు వెళ్లినా మనమందరం కలిసి పోవలసిందే, తెలిసిందా। నువ్వీ కుటుంబానికి పెద్ద కొడుకువి. నీ తల్లికి నువ్వన్ని విధాలా సహకరించాలి" అన్నాను.

'అమ్మా!' అంటూ నా మోకాలిమీద తల ఆన్చి హృదయవిదారకంగా ఏడ్చాడు.

హృదయాంతరాళం నుండి మాట్లాడాన్నేను. మై-షెంగ్ వెళ్లినప్పటి నుండీ ఆయన్నుండి ఏ సమాచారమూ రాకపోవడం చాల బాధగాఉంది. అంతకంటే బాధాకరం తినడానికేమీ లేకపోవడం. నేనెట్లాగో ఓర్చుకున్నాను, కాని పిల్లలదే పెద్ద సమస్య.

రెండు డాలర్లకు కొన్ని బట్టలమ్మాను. ఆ డబ్బుతో సిగరెట్లు, కలకండ మొదలగు కొన్ని వస్తువులు కొన్నాను అమ్మకానికి. ఆ తరువాత పిల్లలని దగ్గరకు పిలిచి వారితో మాట్లాడాను.

"మీ నాన్న ఏదో పనుల్లో మునిగి ఉన్నాడు. మనమాయన్ని కుటుంబ వ్యవహారాల్తో బాధపెట్టడం భావ్యం కాదు. మనమే ఏదో తంటాలు పడాలి. మనమంతా ఈ కష్టాల్ని సహించగలమనే అనుకుంటాను. అవునా? ఈరోజు నుండి మనం రేవు వైపు వెళ్లి ఈ సరుకులమ్ముకుందాం".

ఇంటివద్ద పనేమీలేక కొంత, తామూ 'ప్రయోజకులమ'నే గర్వంవల్ల కొంత పిల్లలు బాగా ఉత్సాహపడ్డారు.

ఆలు చిప్స్ చేసి ఒక ట్రేలో అమర్చాను. కలకండ, సిగరెట్లు ఒక బుట్టలో పెట్టాను. ఈ రెండు పెద్ద పిల్లలిద్దరికీ యిచ్చాను.

"చిక్కుల్లో ఇరుక్కోకండి" అంటూ బయటికి పంపుతూ హెచ్చరించాను.

ఆందోళనలు, యుద్ధమూ జరిగే కాలంలో ఇలాంటి చిల్లర సామాన్ల అమ్మకం ఏమంత లాభసాటి కాదని తొందరలోనే తెలిసొచ్చింది. పిల్లలిద్దరూ ఉదయం నుండి సాయంత్రం వరకు అమ్మితే గిట్టే లాభం బహు స్వల్పం. అంతేకాక, రేవు వైపు వాళ్లు ఒంటరిగా ఉండడం నిరంతర భయంగా ఉండేది. కాని ఏం చేయగలను? పిల్లలు సంపాదించే ఆ కొద్ది పైసలే మాకుగల ఆదాయం. ఈ రోజుల్లోనే నాకూ తురుపెన్-షువాంగ్‌కు జబ్బు చేసింది. మందు మాకు ఇప్పించలేక పక్కన కూర్చుని రాత్రిం బవళ్లు బిడ్డ బాధపడుతుంటే చూడడం తప్ప ఏమీ చేయలేకపోయాను.

ఒక రోజు పిల్లలు మామూలు సమయానికి రాలేదు. బాగా చీకటికూడా పడింది. వస్తారనే ఆశతో మూడుసార్లు వేడిచేసాను అన్నం. కాని వాళ్లు రాలేదు. కలవరం మొదలైంది. చి-హో, షువాంగ్-లిన్ నిద్రపోగానే పెన్-వెన్‌తో మాట్లాడాను.

"చెల్లెను చూస్తూఉండు. ఏడిస్తే కొంచెం నీళ్లు తాగించు. నీ అన్నలు కని పిస్తారేమో చూసి వస్తా".

"నాకు.... నాకు భయమైతుందే" అంటూ ఏడ్చింది.

"పిరికివాళ్లు భయపడతారు. అంతకూ నీకు భయమనిపిస్తే ఏదైనా పాట పాడుకో. కాని పిల్లని లేపకు సుమా. ఏం;"

నిర్జనమైన నదీతీర ప్రాంతం పొడుగునా మసక దీపాల పంక్తులు అస్పష్టంగా ప్రతిఫలిస్తున్నాయి. చల్లటి రాత్రి గాలి నన్ను పూర్తిగా జాగృతం చేసింది. హఠాత్తుగా నా కండ్ల ఎదుట ఏవో నల్లని ఆకారాలు కదలాడినాయి నా కళ్ల భ్రమేమోనను కున్నాను కొద్ది క్షణాలు. అక్కడ మూర్ఛపోతపోతేనే బాగు అనుకున్నాను. పూర్తిగా కోలుకొని కళ్లు చిట్లించి జాగ్రత్తగా చూద్దునుకదా, నన్నా ఆకారాలు పూర్తిగా ముట్టడించాయి. అదొక క్రూరమైన కుక్కల గుంపు. పొలిమేరల్లో పీనుగులను పీక్కుతిని పీక్కుతిని మరీ క్రూరంగా తయారయ్యాయవి. మొరుగుతూ కొన్ని వచ్చి నామీద పడ్డాయి. గంతులువేస్తూ, అరుస్తూ, వాటిపై రాళ్లు విసుర్తూ ఎలాగో తప్పించు కున్నాను మొత్తానికి.

శ్మశాన నిశ్శబ్దం ఆవహించింది రేవు. రేవు ప్రాంతాల సాధారణంగా వినవచ్చే 'హైలేస; హైలేస;' అరుపులు కూడా వినరావడం లేదు. సరుకులు దించే చోట

పడవలు ఎండిన మిడతల్లా పడివున్నాయి. నదీ జలాలు వాటిచుట్టూ సుళ్లుసుళ్లుగా నిశ్శబ్దంగా తిరుగుతున్నాయి. అకస్మాత్తుగా, దీపస్తంభం (lamp post) క్రింద కూర్చున్న ఇద్దరు పిల్లలు కంటపడ్డారు.

"అరేయ్ లియాన్, ఇంటికి రాకుండా ఇక్కడ ఏంచేస్తున్నావ్రా?"

"అమ్మా, ఇంకోటి, ఇంకో ఓడ వస్తుందమ్మా. దాని కోసమే ఎదురు చూస్తున్నాం" అని అరిచాడు.

మరీ దగ్గరికి వెళ్లాను. యింగ్-చీన్ ఆ స్తంభాన్ని ఆనుకొని నిద్రపోయాడు. భుజంమీద మృదువుగా తట్టాను.

"యింగ్-చీ....న్, యింగ్-చీన్, లే. పద. ఇంటికి పోదాం పద".

కొద్దిగా కండ్లు తెరిచి మత్తుగా 'అమ్మా!' అని మళ్లీ తలవాల్చాడు. వంగి లేవదీసాను.

"అమ్మా, మొదలు నువ్వు యింగ్-చీన్‌ను తీసుకొని వెళ్లు. నేనిక్కడే ఇంకొంచెంసేపు చూసి వస్తాను".

"వద్దు, అందరం కలిసే వెళ్దాం. మీ యిద్దరికీ బాగా అకలి అవుతుండవచ్చు. అయినా యింక ఈరోజుకేమీ అమ్మలేరులే!" అంటూ చెరొక చేత్తో పట్టుకొని బయల్దేరటానికి సిద్ధమయ్యాను.

"కాని, ఇంకో ఓడ వస్తుందమ్మా" ఓడలు ఆగేవైపు చూస్తూ అన్నాడు. కుక్కలను తప్పించుకోడానికని చుట్టూ తిరిగి వెళ్లాము. ఇల్లు సమీపించే సరికి పెన్-వెన్ ఏడ్వడం వినిపించింది. భయంతో ఇంట్లోకురికాను. ద్వారం తలకు కొట్టుకుంటున్నా లెక్కచేయక.

"ఏం జరిగిందమ్మా?!"

"అమ్మా, అటు చూడు, పెన్-షువాంగ్ వైపు!"

అమ్మాయి జ్వరంతో ఎగపోస్తూంది. నీళ్లు తేబోయాను. భయంతో చేతులు వణికి నీళ్లు నేలమీద ఒలికిపోయాయి.

కొద్దిసేపట్లోనే పిల్ల ప్రాణాలు విడిచింది.

రాత్రింతా గుండె పగిలేటట్లు ఏడ్చాను. తెల్లవారి ఇంట్లో ఉన్న కొద్ది సామాన్లు అమ్మాను దహన ఖర్చులకని. పెద్ద పిల్లలిద్దరూ శవాన్ని ఒక ఏకాంత ప్రదేశానికి మోయటంలో సహాయపడ్డారు. సమాధి ప్రక్కనే కూర్చున్నాము చాలసేపు సమాధి చేసింతర్వాత. నాకు కాళ్లాడలేదు. నా శరీరభాగాన్నే-గుండెను-పూడ్చినట్లనిపించింది.

కొద్దిరోజుల తరువాత, మై-షెంగ్ మిత్రుడొకాయన నన్ను చూడవచ్చాడు. ఎంత ఆనందపడ్డానో వర్ణించలేను. కూర్చోమనడానికి కనీసం బెంచి అయినా లేకపోయింది. అతడెలాగో పక్కమీదనే ఒక అంచుకు కూర్చున్నాడు.

"చెల్లీ మై! నువ్వు కష్టాలు పడుతూ ఉండి ఉంటావని మన పార్టీకి తెలుసు. అందుకే చూసి రమ్మని నన్ను పంపారు. నీకేమైనా అవసరమైతే చెప్పు".

ప్రజలు చేస్తున్న త్యాగాలు, సందిగ్ధావస్థలోనున్న విప్లవం, పార్టీ ఆర్థిక ఇబ్బందులను చూసి ఏమడుగుదామన్నా మనస్కరించలేదు. చివరికి అమ్మాయి చావు వార్త చెప్పి వాళ్లకు విచారం కలిగించడానికి కూడా మనసొప్పలేదు.

"నిన్ను చూస్తేనే నాకెంతో ఆశ బలం వస్తుంది. నాకు ఇబ్బందులంటూ పెద్దగా ఏమీలేవు. బాగానే ఉంటున్నాను. మై-షెంగ్ విషయమే ఎటూ తెలియక దిగులుగా ఉంది".

"ఇప్పుడాయన వుహాన్‌లో ఉన్నాడు"

"చూడడానికి మేము పోవచ్చునా?"

సమాధానం చెప్పకుండా పిల్లలవైపు చూశాడతడు.

"నేనాయన్ను చూడాలనుకుంటున్నాను".

"అహ... అక్కడి పరిస్థితులూ దాదాపు ఇక్కడిలాగే ఉన్నాయి. మీరు పోకపోతేనే మంచిది. అంతకూ ఏమైనా ఇబ్బందులుంటే, పార్టీయే సహాయం చేయడానికి ప్రయత్నిస్తుంది".

అతడు చెప్పే తీరుచూస్తే వుహాన్‌లో పరిస్థితి చాల తీవ్రంగా ఉండి ఉండాలనుకున్నాను. ఎలాగైనా అక్కడికి పోవాలని నిర్ణయించుకున్నాను.

"నేనిక్కడ ఉండి ఏమీ లాభంలేదు, పైగా పార్టీకి బరువు. వుహాన్‌కు వెళ్తే మై-షెంగ్‌కు సహాయంగానైనా ఉండవచ్చు".

"సరే చూద్దాం. నేను పార్టీతో మాట్లాడుతాను" ఇక నాకు నచ్చజెప్పి లాభం లేదనుకుని అన్నాడు.

రెండవరోజు వచ్చి నన్ను పోగూడదని ఒప్పించడానికే ప్రయత్నించాడు మళ్లీ.

"వుహాన్ పరిస్థితి గురించి మాకు ఖచ్చితమైన వార్తలేవీ అందలేదు. పరిస్థితి ఇక్కడికంటే విషమంగానే ఉన్నట్లుంది...." అన్నాడు.

"అట్లా అయితే తప్పక వెళ్లాలి. మై-షెంగ్‌ను ఒంటరిగా కష్టాల నెదుర్కోనివ్వను. మేమిద్దరమూ ఒకటే, చావాల్సివస్తే ఇద్దరమూ ఒకసారే చస్తాం. ఇంత మంది ప్రజలు తమ ప్రాణాలర్పిస్తూంటే, నేను చేతులుముడుచుకొని ఒడ్డున నిలబడలేను"

చిట్టచివరకి రెండు "సందిగ్ధమైన" చిరునామాలిచ్చాడు చేతికి, చేసేదిలేక.

అక్టోబర్ నెల. అప్పటికే బాగా చలిగా ఉంది. ఉన్న దళసరి బట్టలన్నీ తొడుక్కున్నాం. మోత బరువు కొంచెం తగ్గింది. ఇదివరకటి కామ్రేడ్, స్టీమర్ టికెట్లు తేగానే రేవుకు బయల్దేరాను అయిదుగురు పిల్లల్ని వెంటబెట్టుకొని.

ఇంకో అరగంటలో ఓడ బయల్దేరుతుందనే వరకూ కిందనే ఉన్నాం. ఒక్కో ఓడ సాధారణంగా రెండు మూడు వందల టన్నుల బరువు మోస్తుంది ప్రయాణీకుల సంఖ్య చూస్తే ఇటువంటి ఓడలెన్నైనా చాలేట్టులేవు. పిల్లల్ని నాకోటు కొనలు పట్టుకొమ్మని గుంపులో నుండి తోసుకుంటూ ముందుకుపోయాను. నలిగి నలిగి చివరకి గుంపు మధ్యలోకి వచ్చాం. ఎటూ కదిలేటట్లు లేదు. చెమటలు కారుతున్నాయి. హఠాత్తుగా నా చేయిపట్టుకొని లాగినట్లనిపించింది. చూద్దునుకదా నాకు టికెట్లు తెచ్చిన కామ్రేడ్ మందలింపుగా తలతాటించాడు.

"మొత్తానికి పట్టుదల మనిషివే!"

నవ్వాను. "నాకేం ఫరవాలేదన్నా. ఇంటికి వెళ్లిన తరువాత అమ్మను నా గురించి ఏమీ బెంగ పెట్టుకోవద్దని చెప్పు ఏం!" అన్నాను గొంతు తగ్గించి.

జవాబుగా ఇకిలించాడు. చేతికేదో పొట్లం యిచ్చాడు.

"ఇదిగో, దార్లో పిల్లలు తినడానికి కేకులు...."

అతడు రాకపోతే మేము ఓడ ఎక్క గలిగేవాళ్లమే కాదు. చిన్న పిల్లల్నిద్దరినీ పైకెత్తి పట్టుకొని మమ్మల్ని ముందుకు తీసుకుపోయాడు. "కాళ్లు జాగ్రత్త, ఇంకొకళ్ల కాళ్లు తొక్కేరు సుమా" అని హెచ్చరిస్తూ. ఎలాగైతేనేం ఓడ ఎక్కగలిగాం.

"దొంగలుంటారు కనిపెట్టి ఉండాలి. కనిపించకపోతే తిరిగిరా!" అంటూ ఏవేవో కొన్ని సలహాలిచ్చాడు.

పడవ పూర్తిగా నిండింది. ఎవరి కాళ్లు తొక్కకుండా కదలడం కష్టం. మేమొక మూలకు చేరాం. కూర్చోవడానికి మాత్రమే స్థలముంది.

"ఏయ్! కండ్లు కనిపించడం లేదా, నెత్తిమీద కూర్చుంటున్నావ్." ప్రయాణీకుల్లో ఎవరిదో అరుపు.

గత మాసం అప్పుడప్పుడూ కాసిన ఎండలవల్ల ఏరు తీసింది కొద్దిగా. అందుకే మధ్యలో ఒక రేవులో మూడు రోజులాగింది, సర్గిగా సాగలేక. దాంతో మా దగ్గర ఉన్న తినుబండారాలు గమ్యస్థానం చేరకముందే నిండుకున్నాయి. వెదురు బుట్టల్లో ముద్దుబియ్యపు అన్నంతెచ్చి ఒక్కొక్కరికి ఒక గిన్నెడు చొప్పున అమ్మారు. డబ్బు లేకపోతే ఉపవాసం ఉండవలసిందే. ఒక సందర్భంలో పెద్ద వాగ్యుద్ధంగూడా రేగింది.

"చంపండి, నీళ్లల్లోకి తొయ్యండి!"

చుట్టూ చూశాను. దెబ్బల వర్షం కురిపిస్తున్నా ఆకలితో ఒక పిడికెడు మెతుకులు నోట్లో కుక్కుకుంటున్నా డొక చింకి గుడ్డల మనిషి. డబ్బులేక, ఆకలికోర్వలేక కొంచెం అన్నం దొంగిలించాడు ఒక బుట్ట నుండి. చూడలేక ముఖం తిప్పుకున్నాను. లి-యాన్‌కు అతణ్ణి అట్లా కొడుతున్నందుకు వాళ్లమీద కోపం వచ్చింది. వాడికి కోపం రావడం చూచి వారించ ప్రయత్నించాను ఏదైనా చిక్కుల్లో ఇరుక్కుంటాడనే భయంతో. నా పట్టు విడిపించుకొని ఆ మనిషికి తన అన్నం గిన్నె ఇచ్చాడు.

సాధారణంగా వుహాన్‌కు రెండు రోజుల ప్రయాణం. కాని మాకు ఆరు రోజులు పట్టింది. వుచాంగ్‌వద్ద ఎల్లోక్రేన్ టవర్ (Yellow Crane Tower) కంటబడగానే గుండె వేగంగా కొట్టుకుంది. మేము దిగగానే ఏమెదురవుతుందో సంతోషమో దుఃఖమో- ఎవరు చెప్పగలరు.

సాదా బట్టల మనుషులెందరో పడవ ఆగేచోట మూగి ప్రయాణీకులు దిగుతుంటే ప్రతివాళ్ల సామాన్లు పరిశీలనగా చూస్తున్నారు. మేము రేవు నుండి బయటికి వచ్చాం. సైనికులు రైఫిళ్ల బయొనెట్లతో డ్యూటీలో ఉన్నారు.

ఎక్కడికి పోవాలి మేమిప్పుడు? మై-షెంగ్ ఎక్కడున్నాడో నిశ్చయంగా తెలియదాయె. పిల్లల నందరినీ వెంటబెట్టుకొని ఎక్కడని తిరగను? ఏదైనా చిన్న సత్రములో ఒక గది తీసుకుందామనుకున్నాను. తీరా కుదుటపడ్డాక లి-యాన్ ఇంటి వద్ద ఉండనన్నాడు, ఎక్కడో హునాన్ రాష్ట్ర సహకార సంఘం (Hunan Provincial Guild) అడ్రస్ సంపాదించి తండ్రిని వెదకడానికి వెంటనే బయల్దేరాడు.

అక్కడి సేవకుల్లో ఒకడు లి-యాన్‌ను పిలిచి "చూడబ్బాయ్, వీలైనంత తొందరగా తిరిగిరా. ఏడు తరువాత నిషేధాజ్ఞలు అమలులోఉంటాయి" అని సలహా యిచ్చాడు.

సాయంత్రం కావస్తూంది. మనసు నప్పుడప్పుడే దిగులు ఆవరించబోతూంది. ఇంతలో మై-షెంగ్, లి-యాన్‌లు చేతిలో చేయి లంకె వేసుకొని ద్వారం వద్ద ప్రత్యక్షమయ్యారు. మై-షెంగ్ పాతకాలపు అంగీ వేసికొని టోపీ పెట్టుకున్నాడు. పిల్లలంతా అరుపులతో ఆనందంగా తండ్రి ఒడిలోకురికారు. పిల్లలని కౌగలించుకుంటూ నావైపు చూశాడు.

"ఎలాగైతేనేం వచ్చేశావన్నమాట!" అన్నాడు స్వరంతగ్గించి. చుట్టూ కలయజూసి "పెన్-షువాంగ్ ఏదీ?" అని అడిగాడు.

పిల్లలందరూ మౌనం వహించారు. గొంతులో ఏదో తట్టుకొని మాటలు తడబడ్డటనిపించింది. ఒక్కపెట్టున ఏడవసాగాను.

## 6

ఈ కాలపు యువకులకు 'తెల్ల భయం' (White Terror)అనే శబ్దాలకు అర్థం తెలియడం కష్టమని నా అభిప్రాయం. విప్లవ ప్రతీఘాతుకులు విప్లవకారులపైనా సాధారణ ప్రజానీకంపైనా జరిపే అమానుష దౌర్జన్యకాండలను కళ్ళారా చూడకుండా ఈ శబ్దాలకు అర్థం ఊహించడం నిజానికి కష్టమే. ఆ కాలంలో ఉండి, స్వయంగా బాధలుపడ్డ నాకే చాలసార్లు ఆ బందిపోట్ల స్వభావం అంతుపట్టలేదు.

స్నేహితులు కొందరొకచోట చేరి ముచ్చటించుకుంటూ ఉత్సాహంగా ఉన్నారనుకోండి. అకస్మాత్తుగా తుపాకి కాల్పులు వినిపించేవి. కొద్దిసేపట్లోనే స్త్రీ పురుషులెంతోమంది రక్తపు మడుగుల్లో పొర్లాడుతూ కనిపించేవారు. మరుసటి దినము విప్లవ ప్రతీఘాతుకుల పత్రికల్లో వార్త పడేది. "తిరుగుబాటు కమ్యూనిస్టుల కుట్ర సమాచారమందగానే మన ఆత్మరక్షక దళాలు కమ్యూనిస్టు కుట్రదారులపైన దాడి జరిపి ఆశ్చర్య చకితులను చేశాయి. చాలమంది కమ్యూనిస్టుల నక్కడికక్కడే అంతమొందించారు".

ఎర్ర రిబ్బను తలకు చుట్టుకున్న ఒక యువతిని "కమ్యూనిస్టు గూఢచారి" గా అనుమానించి గూఢచారులు చంపేశారు. చిత్రహింసల పాలైన ఆ శవం ఏటి ఒడ్డున పడి కనిపించింది.

దీపాల పండుగ (Lantern Festival) నాడు ఒక ఇంటివాళ్లు తమ యింటి ముందొక ఎర్ర లాంతరు వ్రేలాడ గట్టుకున్నారు. పోలీసువాళ్లదిచూసి అది "తిరుగుబాటు"కు రహస్య సంకేతమని చెప్పి ఆ ఇంటిపై దాడి జరిపారు. ఇంటి యజమానిని అరెస్టుచేసి తరువాత హత్యచేశారు. ఆరోజు నుండి దీపాల పండుగ ఆ కుటుంబానికి విషాద దినమైంది.

ఇవి నాకు తెలియవచ్చిన సంఘటనల్లో బహుకొద్ది మాత్రమే. విప్లవ ప్రతీఘాతుకులు ఊహకంద నటువంటి ఘోరాలెన్నో చేశారు. ఏ క్షణాన్నయినా హంతక హస్తం తలుపు తట్టేది.

పార్టీ కార్యక్రమాలన్నీ రహస్యంగా జరుగుతున్నాయి. నేనిక్కడకి వచ్చిన కొద్ది రోజుల్లోనే చాంగ్‌హావో, లుంగ్‌టా-టావో మరియు నా భర్త మై-షెంగ్‌లు జిల్లా పార్టీ సమితి (Country Party Committee) కార్యాలయం, ప్రస్తుత వుహాన్ ఉన్నదీ మూడు నగరాల్లో. (Triplecities) ఒకటీ అయిన హాన్యాంగ్‌లో స్థాపించాలని నిశ్చయించింది. మా కుటుంబం టార్టస్ గుట్ట (Tortoise Hill) కు సమీపాన ఉంది. ఇక జిలా సమితి కార్యలయాన్ని కూడా మా యింట్లోనే పెట్టారు. మాకు

చాల మంది పిల్లలుండడంవల్లా మా యిల్లున్నది మారుమూల ప్రదేశం కావడంవల్లా కామ్రేడ్ల రాకపోకలు బయటివారి దృష్టి నాకర్షించలేదు. నేను ఇంటి యజమానురాలిని. కామ్రేడ్లను రక్షించే భారం నాపై మోపబడింది. అప్పటి నుండి మై-షెంగ్, నేను ఒకేచోట ఉంటూ విప్లవ కార్యక్రమాలు కొనసాగిస్తూవచ్చాం.

బయటికి చూడ్డానికి మా కుటుంబం పెద్దగా సందడిగా సంబరంగా ఉండేది. ఇంటి యజమానురాలిగా "కుటుంబ" రక్షణే నా ముఖ్య కర్తవ్యం. కామ్రేడ్లు నిద్ర పోయినప్పుడు నేనే కాపలా కాసేదాన్ని. అర్థరాత్రి ఏదైనా అనుమానాస్పదమైన అడుగుల చప్పుడు వినిపిస్తే చాలు వెంటనే లేచి మొదట రహస్య పత్రాలు దాచిపెట్టిన చోటు పరిశీలించి అంతా సవ్యంగా ఉందో లేదో చూడడానికి ఇంటి చుట్టూ ఒక చుట్టు చుట్టివచ్చేదాన్ని. బయట ఎవరైనా ఉంటే అతడి కొరకు కాపలాకాసేదాన్ని. కొన్ని సార్లు తెల్లవారే వరకూ. ఇప్పుడు కడగటం, వండటం లాంటి చిన్న పనుల్లో కూడా కొత్త అర్థాలు స్ఫురిస్తున్నాయి, వింత తృప్తి కలుగుతుంది. "ఇది విప్లవ కార్యక్రమం" అని నాలో నేనే అనుకునేదాన్ని.

పిల్లలొకళ్లూ బడికి పోవడంలేదు. లి-యాన్ ఇంట్లోనే ఉండి నన్ను నీడలా అనుసరిస్తున్నాడు. ఎప్పుడైనా ఇంట్లో మీటింగ్ జరుగుతున్నప్పుడు ద్వారంవద్ద నిలబడి కాపలా కాస్తుంటే వాడు నా దగ్గరికి వచ్చి రహస్యంగా మాట్లాడేవాడు.

"అమ్మా, నీకుబదులు నేనుండి కాపలా కాస్తాలే!"

"ఎందుకయ్యా?"

"ఎవరైనా మన ఇంటికి దగ్గరగా వస్తే జాగ్రత్తగా మెలకువగా ఉంటాను".

ఎప్పుడైనా పత్రాలు రహస్య ప్రదేశంలో ఉంచుతే కావలిదారుగా ఉండేవాడు. ఒకసారి బయట ఏదో కోపంగా అరుపులు వినిపించాయి. వెంటనే ఏం జరిగిందో కనుక్కొని రావడానికి బయటికి పరుగుతీశాడు వాడు. ఒక క్షణంలో తిరిగివచ్చి "ఏం లేదమ్మా, ఎవడో కూరగాయలమ్ముకునే వాడు తక్కువ రాళ్లతో తూచాడట. అందుకే జగడం" అన్నాడు. ఇటువంటి పనులుచేసి మళ్ళీ ఉత్సాహంగా తన పని చూసుకునేవాడు.

"నువ్వింత నిర్లక్ష్యంగా ఉంటే ఏదైనా ముప్పువస్తుంది సుమా!" అని హెచ్చరించాను.

"అమ్మా, నాన్న నాకేపని చెప్పడెందుకు? ఇలాగే ఏ పనీ చెప్పకుండా ఉన్నాడంటే ఎటైనా పారిపోతాన"ని గుణిగాడు.

"ఏమిటీ, ఇదివరకులాగా కూలీపని చేయడానికా!"

"అదేమీ కాదు. విప్లవంలో చేరుతాను".

చివరకి "పని" రానేవచ్చింది. ఒకరోజు లి-యాన్‌ను పిలిచాడు మై-షెంగ్.

"ఇదిగో, ఈ రెండు ఉత్తరాలు. నీవే వాటి గమ్యస్థానాలకు చేర్చిరావాలి. చేయగలవా?"

"ఓ! తప్పకుండా, తప్పకుండా చేరుస్తాను నాన్నా" పిల్లవాడు ఈ ఊహించని పిలుపుకు చకితుడయ్యాడు. సంతోషం పట్టలేకపోయాడు.

"ఇది గోలీలాడటం కాదు. తెలుసా? పని మరచి సోమరిగా తిరక్కు. నీ పనేదో చూసుకొని పొద్దు వాలేలోగా రావాలి. యింగ్‌పుచౌకు దారి తెలుసా నీకు?"

"తెలుసు నాన్నా" తల వూపాడు.

ఉత్తరాలు ఎవరెవరి కివ్వాలో వాళ్ల పేర్లు అడ్రసులు చెప్పాడు మై-షెంగ్. తరువాత పిప్పర్‌మింట్ చుట్టే కాగితం అంత ఉత్తరం చేతికిచ్చాడు.

"ఎవరైనా నిన్నటకాయిస్తే వెంటనే వాటిని నాశనం చేయ్యాలి. అవి పరాయి వాళ్ల చేతుల్లో ఎంత మాత్రమూ పడవద్దు. ఎక్కడ పెట్టుకుంటావ్ వాటిని?"

"హాట్ అంచులో పెట్టుకుంటానేం? చావో మామ ఎప్పుడూ అక్కడేపెట్టాడు" అన్నాడు లి-యాన్.

చావో ఇక్కడికి సమాచారాలందజేసే కామ్రేడ్. నిన్ననే పట్టుబడ్డాడు.

"అహఁ, అక్కడ లాభంలేదు. ఈ పిప్పరమెంటుకు చుట్టుకో. ఏదైనా ఆపదల్లో చిక్కుకుంటే నోట్లో వేసుకుని మింగు"

అన్ని ఏర్పాట్లు జరిగిన తరువాత లి-యాన్ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్లిపోయాడు. పిల్లవాడు బయటికి వెళ్లగానే నాకు దుఃఖం పొర్లుకొచ్చింది. బయటి పరిస్థితులు చాల తీవ్రంగా ఉన్నాయి. పిల్లవాణ్ణి ఈ సాహసానికి దిగనివ్వకుండ వలసింది. ఏదైనా ఆపదవస్తే. "పెద్దవాళ్ల ఉద్యమమైతే బయటివాళ్ల దృష్టిని బాగా ఆకర్షిస్తుంది. పైగా ఇప్పటికిప్పుడు వార్తాహరుడు దొరికేట్టులేడు. ఉత్తరాలేమో అందజేయాలాయె, ఎట్లా తప్పదు మరి" అన్నాడు మై-షెంగ్.

మై-షెంగ్ నాతో ఇంతగా వాదించినా లి-యాన్ రాత్రి భోజన సమయానిక్కూడా రాకపోయేసరికి ప్రశాంతంగా ఉండలేకపోయాడు.

"పోయి చూసి వస్తానుండు" అన్నాడు.

"ఒక నిమిషం ఆగు. ఏదో అడుగుల చప్పుడు వినిపిస్తూంది. అంత ఆత్రంగా ఉరికి వస్తున్నారెవరో?" అన్నది. అడుగుల చప్పుడు మరీ దగ్గరగా వినిపించింది.

"హమ్మ, వచ్చేశాడులే!" అన్నాను లి-యాన్ అడుగుల చప్పుడు గుర్తుపడ్తూ వెంటనే.

"అది చేసేశాను!" లోపలికి వచ్చి రొప్పుతూ అన్నాడు.

"ఇంత ఆలస్యం ఎందుకైంది?" తండ్రి చిటపటలాడ్తూ అన్నాడు.

"మళ్ళీ పర్రిజల్ని చంపుతున్నారు బజార్లలో. ఎవర్నీ పోనివ్వడం లేదు. అడ్డ దారి తొక్క వలసి వచ్చింది. బాగా ఆలస్యమైందా?" చెమట తుడుచుకుంటూ అన్నాడు.

"అవును" మై-షెంగ్ మెత్తబడి అబ్బాయి కొక గ్లాసెడు నీళ్ళిచ్చాడు.

మొదటిలోనే సమయానికి తిరిగి రాలేకపోయినందుకు అబ్బాయి కొంచెం నిరుత్సాహపడ్డాడు. ఇప్పుడంతగా మాట్లాడడం లేదు- నీళ్ల కాగపెడ్తూంటే పొయ్యి పక్కగా కూర్చుని చితుకులు ఎగదోసి మంట బెట్టాడారాత్రి. మౌనంగా ఉన్నాడు. ఒక్క మాటకూడా మాట్లాడలేదు. ఎన్నోవిషయాలు మెదుల్తున్నట్లున్నాయి మనసులో.

"ఆలస్యంగా రావడం నీ తప్పు కాదులేరా" అన్నాను ఉత్సాహపరుస్తూ.

"అబ్బ ఎంత అమానుషమమ్మా!" బాగా కలతచెందాడు.

"ఎవర్ని చంపారో తెలుసా అమ్మా! స్త్రీని, ఒక గర్భిణీ స్త్రీని! ఆమెను చావబొడిచారు, కాని పిండము గర్భమున కదుల్తూనే ఉంది ఆ దృశ్యం చూసిన వాళ్లంతా ఏడ్చారు".

నాకూ ఎంతో విచారం కలిగింది. "వాళ్ల దౌర్జన్యం ఇంకెన్నో రోజులు సాగదులే. మనం పగ తీర్చుకునే రోజు తప్పక వస్తుంది" అన్నాను.

పిల్లలపైదృష్టి పడకపోవడంతో లి-యాన్ ప్రతినిత్యం పార్టీపత్రిక టాకియాంగ్ దినపత్రిక, తదితర పత్రాలు నిర్ణీత ప్రదేశాలకు చేరవేస్తూనే ఉన్నాడు. వార్తా పత్రి కల్ని సన్నటి మడతలుగాపెట్టి వాడి బెల్ట్‌వద్ద లాగుకు దారంతో కట్టేవాన్ని. పైనుండి చొక్కా కప్పివేసేది. ఒక్కసారికి ఎనిమిది చోట్లకు ఎనిమిది పత్రికలు చేరవేయ గలిగేవాడు.

జనవరిలో తీవ్రమైన చలిగాడ్పులువీచి మడమలు మునిగేంత మంచుపేరుకొంది. కార్మికుల క్వార్టర్లకు పత్రాలు, పత్రికలు చేరవేయడానికి హాన్‌నది దాటి యింగ్‌వుచౌకు రోజుకెన్నో చుట్లు తిరిగేవాడు ఆ చలిగాడ్పుల్లో లి-యాన్. రోజుకు సుమారు 10 కిలోమీటర్లు నడిచేవాడు. ఇంటింటికీ తిరగడంవల్ల యింగ్‌వుచౌలో వాడికి తెలియని చోటంటూ లేకపోయింది. ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాళ్ల యింటికి పోయినవాడు కావడంతో అందరూ వాత్సల్యంతో చూచేవారు. ప్రతిసారి యింగ్‌వుచౌ నుండి కార్మి

కులు యిచ్చిన పిప్పరమెంట్లో, మాహూవా (పొరల బిస్కెట్‌వంటిది) నో తెచ్చుకొనే వాడు. తన తమ్ముళ్లకు చెల్లెళ్లకు మిగిల్చి తాను కొంచెం కొంచెంగా ఊరించుకుంటూ తినేవాడు. కేవలం తనొక్కడి కొరకే ఉంచుకున్న కానుక ఒక్కటే. వాంగ్ మామ యిచ్చిన పావురాల జత. గోధుమవన్నె ముక్కు, పసుపుపచ్చ కండ్లతో చాల ముచ్చటగా ఉన్నాయి. వెదురు పంజరం ఒకటి అల్లి చూరుకింద వేలాడగట్టాడు దాన్ని. రెండవసారి వెళ్లినపుడే వాంగ్‌మామ ఎక్కడా కనిపించలేదు. వెళ్లి గొళ్లెం పెట్టని తలుపు నెట్టేసరికి ఎవరో అరిచారు.

''ఆగు! ఎవరు నువ్వు?'' అంటూ ఒక వ్యక్తి తన పిస్తోలు వాడివైపు గురిపెట్టి అడిగాడు, ఒక మూల నుండి వచ్చి.

లి-యాన్ ఉలికిపడ్డాడు. వెంటనే సంబాళించుకొని "నా పెరుగు డబ్బు వసూలు చేసుకోవడానికి వచ్చానిక్కడికి...." అన్నాడు.

"ఛ.... ఫో బయటికి, పెరుగూలేదు గిరుగూలేదు, నీ కిక్కడెవడూ బాకీలేడు ఫో'' అంటూ ముఖంమీద కొట్టాడు.

లి-యాన్ ఏడ్వసాగాడు. ''మీదంతా అక్రమంగా ఉంది. మా నాన్న జబ్బుగా ఉండి 18వ నంబరు ఇంట్లో పెరుగు డబ్బు అడుక్కు రమ్మన్నాడు. డబ్బు ఇవ్వక పైగా కొడ్తున్నారు....''

"ఫో గుడ్డి నాయాల! ఇది 17వ నంబరు తక్షణం బయటికిపో, లేకపోతే కాల్చిపారేస్తాను."

లి-యాన్ ఆదేసందని తప్పించుకున్నాడు. మళ్ళీ శతృవుల చేతుల్లో చిక్కుతానేమోననే భయంతో నదీతీరానగల మారుమూల ప్రదేశానికురికి పత్రాలు కాల్చి వేశాడు. రహస్యంగా 17వ నంబరు ఇంటికి వచ్చి హెచ్చరికగా గుర్తుపెట్టాడు.

"సెభాష్! అదీ. శత్రువులతో అలాగే ప్రవర్తించాలి." వాడు తన అనుభవాన్ని గురించి చెపుతూంటే తండ్రి మెచ్చుకున్నాడు. "ఎప్పుడైనా శతృవుల చేతికి చిక్కితే ఏమీ చెప్పొద్దు, ప్రాణాలు తీసినా సరే. మన వార్తాహరులందరూ ఇట్లాగే నడుచుకున్నారు." ఈ మెచ్చుకోలు, ప్రోత్సాహంతో వాడి ముఖం ఆనందంతో వెలిగింది. నిట్టూరుస్తూ పక్షులను విడచిపెట్టారు. గతించిన వాంగ్‌మామే మనసులో మెదుల్తున్నాడు.

## 7

మా సంస్థ కార్యాలయ ముఖద్వారం ఎల్లోక్రేన్ టవర్ వైపు. వెనుక ద్వారం టార్టస్ గుట్టవైపు ఉన్నాయి. చెట్లు పొదలు చుట్టుపట్ల గుట్టల ప్రాంతాన గుబురుగా

పెరిగాయి. ఒక శిథిలమైన ఫిరంగి కోట కూడా ఉంది. దానిచుట్టూ వేలాది పాములు తేళ్లు పాకుతుంటాయి. శరదృతువులో అప్పుడప్పుడు కొందరు బిచ్చగాళ్లు చిమ్మట లను పట్టుకొడానికి పోయేవాళ్లే తప్ప అటువైపు ఎంత గుండెగల పిల్లలైనా పోసాహ సించేవాళ్లు కాదు. మా కామ్రేడ్లంతా ఒక సన్నని పిల్లబాటద్వారా రాకపోకలు సాగించే వారు. సమావేశం జరుగుతున్నప్పు డేదైనా అపాయ సంకేతం వచ్చిందా, వెనుక ద్వారం నుండి గుట్టమీదికి జారుకునేవాళ్లు.

ఆ చలికాలము పరిస్థితి నానాటికీ విషమించింది. కోమింటాంగ్‌దళాలు ఎక్కడ చూచినా ప్రజలను బలవంతంగా బందీలుగా తీసుకుపోతున్నారు. వాళ్లల్లో రేవు కార్మి కులు, రిక్షా కార్మికులు ముఖ్యులు. నాలుగైదు రోజుల్లోనే ఐదువేల మందికి పైగా లాక్కుపోబడ్డారు. దీని తరువాతనే జిల్లా పార్టీ సమితి (Party Country Committee) వాళ్లు రేవు కార్మికులతో ఒక తిరుగుబాటు ఊరేగింపు తీయించారు. ఇప్పటికి విప్లవం - ప్రతివిప్లవం ఒక నిర్దిష్టమైన బాహాబాహి సమరంగా రూపొందింది. మొదటి రోజే ఒక బట్టల మిల్లు బయట విప్లవ ప్రతీఘాతుకులు ముగ్గురు నవయువతులను కాల్చి చంపారు. పగ తీర్చుకోవడం కూడా త్వరలోనే జరిగింది. పోలీసు వాళ్లకు సమా చార మందజేసిన ద్రోహిని రెడ్‌గార్డులు చౌరస్తాలోనే చంపారు. సైనిక పరిపాలన ప్రకటన పత్రాల పక్కనే తిరుగుబాటుకు పిలుపునిస్తూ ప్రకటన లతికించారు. శత్రు వులు నిషేధాజ్ఞలు అమలులోకి రావలసిన సమయానికి గంటన్నరకు ముందే అంటే యింకా చీకటి పడకముందే రోడ్డుకడ్డంగా చెక్కలు నిలిపారు. కాని ప్రజలు చీకటి మూలల్లో నక్కి గస్తీ జవాను రాకకొరకెదురుచూస్తున్నారు. వాడి మీదపడి ఆయు ధాలు లాక్కొని ఒక గోనెసంచీలో కుక్కి తీసుకుపోతారు.

నగరమంతా ఒక అగ్ని పర్వతంలాగా లోలోపలనే రగులుకుంటూంది. అపరి మితమైన లెవీలకు, పన్నులకు తట్టుకోలేక దుకాణాలు, ఫ్యాక్టరీలు మూసేశారు. దాంతో ఎంతో మంది నిరుద్యోగులయ్యారు. ఆఖరికి ప్రభుత్వోద్యోగులకు కూడా కేవలం నామమాత్రమైన "ధాన్యపు భత్యం" ఇస్తున్నారు. పిటిషన్లు పోయి సమ్మెలువచ్చాయి. పరిసర ప్రాంతాల్లో సాయుధ పోరాటం తీవ్రరూపం ధరించింది. మొత్తంమీద విప్లవ తిరుగుబాటుకు పరిస్థితులు అనువుగా లేవు. పార్టీవాళ్లు ఎదుర్కొడానికి బదులు వ్యూహా త్మకంగా వెనక్కు తగ్గితేనే బాగుండేది. కాని పార్టీ ముఖ్యస్థానాల్లో అప్పుడు వామ పక్షీయుల 'అతి సాహసిక ధోరణి' (adventurism) ప్రబలంగా ఉంది. పరిస్థితిని తప్పుగా అంచనావేసి, వెనక్కు తగ్గటాన్ని వ్యతిరేకించారు. ఎదుర్కోవడమే సాగా లన్నారు. ఇలాంటి భావాల ప్రభావంతోనే రాష్ట్ర కమీటీ నూతన సంవత్సర సమయాన

తిరుగుబాటు జరపాలని ఆదేశం జారీచేసింది. హోన్యాంగ్ జిల్లాలో పార్టీ కమిటీ పని మరీ కఠినమైంది.

ఒకరోజు బాగా మంచు కురిసింది. గుడ్డ బూట్లు కుట్టుకుంటూ గదిలో కూర్చున్నాను. హఠాత్తుగా చాంగ్‌హోవా ముందు ద్వారం నుండి ప్రవేశించాడు. సాధారణంగా ముందు ద్వారం నుండి ఎవరూ రారు. చాల కలవరపడ్డాను.

"సంగతులెట్లా ఉన్నాయి" బట్టలమీది మంచు దులుపుకుంటూ అడిగాడు.

"అసలు నీ సంగతేమిటి. ముందు నుండి రావడంలో నీ భావం?" అన్నాను. మందలింపు స్పష్టంగానే ఉంది.

"ఇంత మంచులో గుట్టమీది నుండి వచ్చేటంత మూర్ఖుణ్ణి కాను. నా అడుగు జాడ లెవరు చెరిపేస్తారు? వస్తే క్షణాలమీద కనిపెట్తారు. విషయం తొందరగా పసి కట్టేదానివి, ఈరోజు నీకేమైంది?" అన్నాడు. చాంగ్‌హోవా మహాకాయము పైకి కనిపించే మొరటుతనము అతని తీక్ష్ణ పరిశీలనా దృష్టిని అలవాట్లను కప్పిపుచ్చుతూంది. మే 1925వ షాంఘైలో జరిగిన ఒక సంఘటన గురించి విన్నాను. చాంగ్‌హోవా పర్యవేక్షణలో ఒక ఊరేగింపు బయల్దేరింది. అప్పుడొక పోలీసువాడు బయొనెట్‌తో ఇతడి పుర్రె బ్రద్దలు చేశాడట. అయినా లెక్క చేయకుండా ఉపన్యాసమిద్దామని స్టేజి ఎక్కాడు. రెండు మూడు మాటలైనా మాట్లాడకముందే స్పృహ కోల్పోయాడు. పోలీసువాళ్ల వెన్నాడుతున్నారని ఒక హాస్పిటల్ నుండి మరొక హాస్పిటల్‌కు తిప్పారట. చివరికి కోలుకున్నాడు. కాని అప్పుడప్పుడు తలనొప్పి వస్తూంది. మొత్తానికి చాల ధైర్యము, వివేకము గలవాడు!

గది చుట్టూ కలయజూసి "ఆఁ.... మై-షెంగ్ ఇంటికొచ్చాడా?"

"ఇంతకుముందే రేవునుండి వచ్చాడు, ఈపాటికి గాఢనిద్రలో ఉండిఉంటాడు".

"నేను గాఢ నిద్రపోలేదు" మై-షెంగ్ పడకగది తెరలు తొలగించి బయటికి వస్తూ అన్నాడు. "సరేగాని, సమాచారాలేమిటి?"

"అర మిలియను సైన్యముతో కమ్యూనిస్టు పార్టీ వుహాన్‌ను ముట్టడించనున్నట్లు పుకారుగా ఉంది. జనరల్ హోలంగ్ 3000 రివాల్వర్లు, 40 మషీన్‌గన్లు కూడా తెచ్చాడట. కార్మికులందరికీ తిరుగుబాటు చేయమని పిలుపు యిచ్చాడట...."

"హు.... మన శత్రువు మనం ప్రత్యక్ష చర్యకు దిగకముందే అప్పుడే బెదురుకున్నాడు" అన్నాడు మై-షెంగ్.

"అసలు సమస్యే అదిగదా. చూడబోతే శత్రువు తగు జాగ్రత్తపడుతున్నట్లున్నాడు. తిరుగుబాటు కిది సరియైన అదను కాదు ... ఏది ఎట్లున్నా, మనకు ఆదేశాలు

వచ్చాయి గనుక వాటిని పాటించ వలసిందే. లేకపోతే అంతా అస్తవ్యస్తమౌతుంది. హుం.... జనరల్ హోలంగ్ 3000 రివాల్వర్లు తెచ్చిందే నిజమైతే ఎంతబాగుంటుంది!"

ఈలోగా మిగతా కామ్రేడ్లు వచ్చారు. చాంగ్‌హోవా ఆనాటి సమావేశం ప్రాముఖ్యాన్ని గురించీ, మేమంతా అప్రమత్తులుగా ఉండవలసిన అవసరాన్ని గురించీ వివరించాడు. చుట్టలు తాగితే మా ఆనవాలు దొరకుతుంది గనుక, తాగవద్దన్నాడు. బయట ఇంకా మంచు బాగా కురుస్తూనే ఉంది. లి-యాన్ అందరి అడుగు జాడలు ఒక చీపురుతో చెరుపుతూ తానే ఒక మంచు మనిషి అయ్యాడు.

"ఇదిగో, ఆ చీపురు నాకిచ్చి నువ్వు కొద్దిసేపు విశ్రాంతి తీసుకో లోపలికెళ్ళి" అన్నాను నేను.

"ఫరవాలేదులే. ఇప్పుడెవరూ రావడంలేదుగా. అసలు ఊడ్చే అవసరంలేదు".

చెమట సన్నని ధారలుగా కారుతూంది వాని నొసటి మీదినుండి. జుట్టు నుండి ఆవిర్లు చిమ్ముతున్నాయి.

నేను లోపలికి వెళ్లగానే "అమ్మా, తాపీ తెచ్చి ఇవ్వవే కొంచెం!" అంటూ పెద్దగా అరిచాడు.

ప్రమాదానికి సంకేతమది. పక్కగదిలో నుండి ఏమాత్రం చప్పుడు రావడం లేదు. తాపీతో రెండు మూడుసార్లు హెచ్చరికగా కొట్టి బయటికి వచ్చాను. పన్నులు వసూలుచేసే ప్రధానాధికారి తల కనిపించింది, దగ్గరికి వస్తున్నట్లుగా.

"ఏమిటీ, ప్రధాని హ్సూగారా, ఈవేళప్పుడు బయల్దేరారేమిటి?" మంచు దులుపుతూ పెద్దగానే అరచాను. "లోపలికి రండి, కొద్దిసేపు కూర్చుని వెళ్దురుగాని."

"అహా... వీలుపడదు. నిన్ను శ్రమపెట్ట దలచుకోలేదు. ఒక విషయం చెప్పడానికొచ్చాను. ప్రతి ఇంటివాళ్లు ఒక పెద్ద పీపా, రెండు లాంతర్లు సిద్ధంగా పెట్టుకోవాలని అధికారుల ఆదేశం. కమ్యూనిస్టులు తిరుగుబాటు జరుపడానికి సన్నాహాలు చేస్తున్నట్లు పుకారుగా ఉంది" బయట ద్వారందగ్గరనే నిల్చుండి సమాధానమిచ్చాడు.

"పీపానా? ఏంచేయడానికి?" లోపల అతడు తొందరగా వెళ్ళిపోతేనే బాగుండునని పించినా ఏదో మాటవరుసకన్నాను.

"నాకేం తెలుసు? నీళ్లకో లేక బియ్యం పోసుకోవడానికో కావచ్చును. దేనికైతేనేం! ఆజ్ఞంటే ఆజ్ఞే. ఈ వస్తువులు సిద్ధంగా పెట్టుకో, వాటితో అవసరం పడవచ్చునే నా నమ్మకం."

అతడింటింటికీ ఈ తాజా ఆజ్ఞ వినిపించడానికి వెళ్లిపోయాడు.

ఆ మధ్యాహ్నం ప్రారంభమైన మా సమావేశం మరుసటి ఉదయానికి గాని ముగియలేదు. అంతసేపూ లి-యాన్, నేను జాగ్రత్తగా కాపలా కాశాం. అలసట గావి, నిద్రగాని ముంచుకువస్తే వాడు మంచుతో ముఖం రుద్దుకున్నాడు. మీటింగ్ ముగిసిన తరువాత కూడా లి-యాన్ ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. వెళ్ళి మిగతా పిల్లలతో కలసి మంచు మనిషినిచేసి ఎగురుతూ గెంతుతూ ఆడుకున్నాడు. తన పని ముగియగానే విశ్రాంతికిగాను ఏవో చిన్నచిన్న ఎక్సర్‌సైజులు చేసేవాడు.

తిరుగుబాటుకు అవసరమైన పథకం తయారైంది. మొట్టమొదట పవర్ స్టేషన్ టెలిగ్రాఫ్ కార్యాలయాలను ఆక్రమించుకొని మిలిటరీ, పోలీసు స్టేషన్లపై దాడి జరపాలి. ఆయుధాలెక్కడి నుండి సంపాదించాలన్నదే మా ప్రధాన సమస్య అయింది. అవే లేకపోతే తిరుగుబాటు మొదలు పెట్టకముందే అణచబడుతుంది.

మై-షెంగ్ ఆయుధ నిర్మాణ శాఖ వారితో సంప్రదించి ఇరవై రైఫిళ్ళ, రెండు మషీన్‌గన్లు బయటికి దొంగతనంగా పంపించే ఏర్పాటుచేశాడు. ఈ కార్యం ఎర్రసైన్యం (Red Guards) సభ్యుడైన యాంగ్‌హ్సింగ్-ఫాకు అప్పగించబడింది. హువాంగ్ అతడికి సహాయకుడు.

మై-షెంగ్ ఆయుధ శాఖ వారివి రెండు గుర్తింపు బ్యాడ్జీలు సంపాదించి ఇద్దరు యువకుల కిచ్చాడు.

"ఇవిగో, ఈ రెండు బ్యాడ్జీలు ధరించి వెనుక ద్వారం గుండా లోపలికి పొండి. అక్కడి కాపలాదారు మనవాడే. ఆయుధాలు చాపలో చుట్టి ఇనుపముక్కల కుప్పలో పడి ఉంటాయి. అవి మోయడానికి ఎవరైనా సాయం కూడా చేస్తారులే. ఎవరైనా వాటిని గురించి ప్రశ్నిస్తే ఇనుపముక్కలనండి. అయినా కార్మికులు ఈ పాత ఇనుము (ఇనుప ముక్కలు) పరస్పర సహాయంతో మోసుకొనిపోవడం కొత్తేమీకాదు. ఇంకా ఏమైనా చేయవలసి ఉందా?"

"మేం ఎలాగో తంటాలు పడతాంలే" యాంగ్‌హ్సింగ్-ఫా ఉత్సాహంతో అన్నాడు.

"సరే మంచిది. అన్నీ సవ్యంగా జరగాలని ఆశిస్తున్నాం" అన్నాడు మై-షెంగ్.

అంతా బాగానే సాగింది మొదట. ఆయుధాలు ఆయుధ నిర్మాణశాఖ నుండి బయటకి తేవడం, పడవలో పెట్టడం విజయవంతంగానే చేశారు. యింగ్‌వుచౌ పక్కనుండి రేవు దిక్కుగా వస్తుంటే పసిగట్టారు. ఇద్దరు గస్తీవాళ్ళ పడవలో వీళ్ళపక్కగా వెంటాడారు. ఇక ఆటకట్టిందని తెలుసుకొని యాంగ్‌హ్సింగ్-ఫా వాళ్ళను ఒక తెడ్డుతో మోది, నీళ్ళలోకి దూకి తప్పించుకున్నాడు. తనమీదికి కాల్పులు జరుగుతున్నా, కాల్పు

ంతో నదీతీరమంతా ప్రతిధ్వనిస్తున్నా లెక్కచేయక. హువాంగ్ పట్టుబడ్డాడు. ఆయుధాలను శత్రువులు స్వాధీనం చేసుకున్నారు.

యాంగ్‌హ్సింగ్-ఫా తడిసి చలికి బిగుసుకుపోయిన బట్టలు, పాలిపోయిన పెదవులతో తిరిగివచ్చాడు.

“హువాంగ్ ఏడీ?” చాంగ్‌హోవా అడిగాడు. యాంగ్ చలికి వణుకుతూ తల ఊపాడే తప్ప జవాబు చెప్పలేకపోయాడు. నేను లోపలి కురికి పొడిబట్టలు తెచ్చి యిచ్చాను. ఒక గిన్నెడు అల్లంసూప్ కూడా తాగించాను. కొద్దిసేపట్లో కుదుటపడి నోరు విప్పగలిగాడు.

“నేను.... నా విధి.... విధి నిర్వహణలో ఓడిపోయాను” అంటూ తడబడుతూ అన్నాడు. “హువాంగ్ పట్టుబడ్డాడు. నేను ఎలాగో నీటిలో దూకి తప్పించుకుని వచ్చాను....”

ఇంకా వివరాలు చెపుతున్నాడు. అతడు చిన్నప్పటినుండీ ఏటి ఒడ్డున్నే ఉన్నాడు. చేపలా ఈదగలడు. నీటిలోపల ఊహించలేనంతసేపు మునిగి ఉండగలవాడు.

“నేను.... నా విధి నిర్వహణలో ఓడిపోయాను” కన్నీళ్లతో మళ్లీ అన్నాడు.

“జరిగిన దానికి నిన్నెట్లా నిందించగలం. పరిస్థితిని సరిగా అంచనా వేయక పోవడం మాదే పొరపాటు. నిందించడం విప్లవకారునికి తగనిపని. ఎలాగో పురోగమిస్తూనే పోవాలి” ఊరడింపుగా అన్నాడు చాంగ్‌హోవా.

చాంగ్‌హోవా, తదితర కామ్రేడ్లు హువాంగ్‌కు వచ్చిన ఆపద ఏమీ లేదన్నారు. మహా అయితే ఆయుధాల దొంగతనం నేరంమోపవచ్చు. అఖరికి లంచమిచ్చి అయినా సంస్థ అతణ్ణి జెయిలు నుండి తప్పించనూ గలదు. అయితే ఇప్పుడు ఆయుధాలు సంపాదించడం ఎట్లా అన్నదే ప్రధాన సమస్య.

“ఆఁ.... తట్టింది. మనమే తయారుచేస్తే!” చాంగ్‌హోవా దృఢంగా అన్నాడు.

అయితే ఈ పథకం కూడా పారలేదు. ఒకరాత్రి చాంగ్‌హోవా, అతడి భార్య ఆత్రంగా వాళ్లు చేస్తున్న బాంబొకటి ప్రమాదవశాత్తు పేలిందనీ, గస్తీవాళ్ల దృష్టిలోపడి వాళ్ల ఇంటిని ముట్టడించేలోగా తాము మాత్రం ఎలాగో తప్పించుకోగలిగామనీ చెప్పారు. ఈ తొందరపాటులో ఇటీవలే పుట్టిన తమ బిడ్డను కూడా తెచ్చుకునే సమయం లేక పోయింది. చాంగ్‌హోవా భార్య, తుచున్-మీంగ్ చేతికి బాగా గాయమై రక్తం చిమ్ముతూంది. గాయం కడిగి, కట్టుకట్టి పడుకోబెట్టాను. చాంగ్‌హోవా మనస్సంతా రానున్న తిరుగుబాటుకు సంబంధించిన పథకాలతోనే నిండి ఉంది. రాత్రింతా అందరమూ ఈ విషయాన్ని గురించే చర్చించుకుంటూ గడిపాం.

# 8

సంవత్సరాంతంలో, సంవత్సరాది సమయాన హూపే, హూనాన్ ప్రాంతాల్లో తిరుగుబాటు చేయవద్దని తీర్మానించినట్లు పార్టీ కేంద్ర కమిటీ వుహాన్‌లోఉన్న కామ్రేడ్లకు తెలియజేసింది. ఇప్పటికే చాల ప్రదేశాల్లో సన్నాహక కార్యక్రమాలు బాగా దెబ్బతినడమూ, శత్రువు మూలంగా ఎన్నో ముఖ్య సంస్థలు విచ్ఛిన్నం కావడమూ జరిగింది. మూకుమ్మడి అరెస్టులు, హత్యలు జరిగాయి. బజార్లలో పోలీసులు, ఏజంట్ల సంఖ్య పౌరుల సంఖ్యను మించిపోయింది. సంవత్సరాది రోజున గస్తీ పోలీసుల అరుపులు, వాళ్ల గుర్రాల డెక్కల టకటకలు తప్ప మరో ధ్వని వినరాలేదు. మచ్చుకైనా ఒక టపాకాయ పేలడం గాని, ఒక ఎర్ర లాంతరు వెలిగించడంగాని జరుగలేదు.

చాంగ్‌హోవా, లింగ్‌టా-టావా, మై-షెంగ్‌లు రాత్రంతా పరిస్థితుల్నిగూర్చి కూలంకష చర్చలు జరిపి ఒక నిర్ణయానికొచ్చారు. మై-షెంగ్ రాష్ట్ర కమిటీకి ఒక అత్యవసర నివేదికరాయాలి. అతడు రాతపనిలో నిమగ్నుడైపోయాడు. మిగతా ఇద్దరు కామ్రేడ్లు కుంపటిదగ్గర కూర్చుని, నిద్రమానుకుని ఆదుర్దాగాచూస్తున్నారు. లింగ్‌టా-టావా ముండ్లమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు. మంచు కురవడం తగ్గిందేమో చూద్దామని ఎన్నోసార్లు లేచి వెళ్లాడు కిటికీ దగ్గరికి. వెంటనే అది రాత్రిఅని గుర్తుకు వచ్చి తిరిగి వచ్చాడు. లోపలి వెలుతురు బయటికి కనబడకుండా, గస్తీవాళ్ల దృష్టిని ఆకర్షించకుండా ఉండాలని కిటికీ తెరలకు నల్లని మందమైన ఒక ప్రత్యేకమైన గుడ్డ వాడాను.

"ఆమె దొరికిందా ?" అని చాంగ్‌హోను తగ్గు స్వరంలో అడిగాను.

"లేదు, ఇంకా లేదు" నేను అతడి కూతురునుద్దేశించే అంటున్నానని తెలుసుకున్నాడు. "ఎటో తీసుకెళ్లారు." పాత ఇంటివైపు తొంగిచూడటమైనా ప్రమాదమేనని వాళ్లు ఒక కొత్త ఇల్లు చూసుకున్నారు. మరో కామ్రేడ్ రిక్షావాడిలా పోయి చూసి వచ్చాడట. పోలీసువాళ్లు ఆక్రమించుకున్నారు ఇంటిని. నేను బరువుగా నిట్టూర్చాను. నాకు ధైర్యం చెప్పే ఉద్దేశంతో అన్నాడు,

"విప్లవం త్యాగాన్ని కోరుతుంది. కష్టనష్టాలు అనివార్యం. అయితే విప్లవకారుని దృష్టి ఎప్పుడూ భవిష్యత్తుమీదే ఉండాలి; ఇది చాలా ముఖ్యం. 'చివరికి నవ్వేవాడే బాగా నవ్వుతాడ'ని ఎవరో మహానుభావుడన్న విషయం తెలియదా ? భవిష్యత్తులో మనకింక దుఃఖాలుండవు, నా మాట నమ్ము !"

అతడన్నది పూర్తిగా నిజం. మనకు కష్టాలొచ్చాయంటే జీవితానికదే చరమదశ అని అర్థం కాదు. ఉజ్జ్వల భవిష్యత్తుండనే ఉంటుంది. (సశేషం)

# నేటి నవల

మరువాడ రాజేశ్వరరావు

తెలుగులో ఒక 'గొప్ప' నాటకం వచ్చింది. కొన్ని 'గొప్ప' కథలొచ్చేయి. కొంత 'గొప్ప' కవిత్వం వచ్చింది. కాని, 'గొప్ప'దని చెప్పుకో తగ్గ నవల యింత వరకూ రాలేదు. యిందుకు ముఖ్యమైన కారణంగా నాకు తోచేది, కథలోను కవిత్వం లోను వచ్చినట్టు నవలకి ఒక క్రమబద్ధమైన పరిణామం లేదు. తెలుగులో మొదట నవల రాసిన వీరేశలింగంగారు కాని, చిలకమర్తి, ఉన్నవ, విశ్వనాథ, చలం గార్లు కాని, తెలుగు నవలకి వరవడి పెట్టలేక పోయేరు. వీరిలో కొందరికి పరిమిత పరిధిలో అభ్యుదయ దృక్పథం ఉన్నప్పటికీ, సమగ్రమైన సాంఘిక దృక్పథం దాదాపు ఎవరికీ లేదనే చెప్పాలి. సమకాలీన సమాజాన్ని సమగ్రంగా అర్థం చేసుకోగలిగిన గురజాడ వారు నవల రాయలేదు. సమగ్రమైన సాంఘిక దృక్పథంతో తెలుగులో మొదటి సారిగా కొన్ని మంచి నవలలు రాసిన ఘనత శ్రీ కొడవటిగంటికే దక్కుతుంది. ఆయన నవలల్లో సమాజ చిత్రణ మధ్యతరగతికి మాత్రమే పరిమితమై పోవడం ఒక లోపం. తెలుగు నవలలో పరిణామం ప్రారంభమైంది కూడా కుటుంబరావుగారితోనే. సమాజ 'చిత్రిణ'లో ఈనాటి నవలాకారులకి ఆయన ఆదర్శం కాకపోయినప్పటికీ, సామాజిక శక్తుల స్వరూప స్వభావాలని బహిర్గతం చెయ్యడంలోను, జీవితాన్ని శాస్త్రీయ దృక్ప థంతో విశ్లేషించడంలోను, పాఠకుడి ఆలోచనా పరిధిని విస్తృతం చేసి చైతన్యాన్ని ప్రేరేపించడంలోను ఆయన్నుంచి నేర్చుకోవలసింది చాలా ఉంది.

తెలుగులో 'మంచి' నవలలు కూడా అట్టే రాకపోవడానికి మరో కారణం, తెలుగు రచయిత(త్రు)లకి విస్తారమైన జీవితానుభవం కాని, జీవితాన్ని అన్ని కోణాల నుంచి అర్థం చేసుకోడానికి అవసరమైన విజ్ఞానం కాని లేకపోవడం పెంట దిబ్బల మీద విస్తారంగా మొలిచే పీతిగన్నేరు చెట్లలాంటి 'సీరియల్' నవలల్నే ధ్యేయంగా పెట్టుకున్నవాడికి జీవితానుభవంతోనూ, జీవితాన్ని గురించిన విజ్ఞానంతోనూ ప్రమేయం ఉండదు. అతని దృష్టి పీతి గన్నేరు చెట్టుకన్నా పైకి పోదు. తెలుగు సాహిత్య రంగాన్ని ఒక పెంట దిబ్బగా మార్చిన పత్రికాధిపతులకి కూడా ఈ ఘనత కొంచెం దక్కుతుంది.

ఈనాటి నవలల్లో ఆధునికత గూడా లోపిస్తోంది. చాలా మంది రచయితలకి, రచయిత్రులకీ ఈనాటి సామాజిక వ్యవస్థ గురించిగాని, ఈ వ్యవస్థలో అమలులో ఉం

టున్న అనేక సంబంధాల స్వరూప స్వభావాలు కాని, సాంస్కృతిక జీవితంలో వస్తున్న మార్పుల్ని గురించి కాని ఏమీ తెలియనట్టే కనబడుతుంది. ఈ కారణం చేతనేనేమో నేటి నవలలో జీవితసత్యానికి బదులు, కొన్ని పాతబడ్డ, ప్రచారంపొందిన దృక్పథాలు, విలువలు మాత్రం కనిపిస్తున్నాయి.

నవలా రచనని ప్రభావితం చేసేవి, రెండు విభిన్న దృక్పథాలున్నాయి.

వ్యక్తుల్ని కేవలం వ్యక్తులుగానే చూస్తూ, వ్యక్తుల జీవితాల్లో సంభవించే పరిణామాలకి కారణాలు ఏ అదృశ్య శక్తిలోనో, ఏ కొందరు వ్యక్తుల మంచి లేక చెడు స్వభావంలోనో, కాకతాళీయంగా జరిగే కొన్ని సంఘటనల్లోనో, మానసిక స్థితిలోనో వెతికే దృక్పథం కొందరిది.

ఈ దృక్పథం కలిగిన వాళ్ళతో సమకాలీన సమాజాన్ని గురించి ఏమీ ఎరగనట్టు ప్రవర్తించేవారు, అంతా తెలిసినట్టు ప్రవర్తించే వాళ్ళు అని రెండు రకాల వాళ్ళున్నారు.

ప్రపంచం ఎంత విశాలంగా ఉన్నప్పటికీ, "ఆడదానికి మగవాడి మురికి పాదాల చెంతనే స్థానం ఉంది"; "ఆడదానికి అహంకారం పనికిరాదు. మగవాడి 'చెప్పు'(?) 'చేత'(!) ల్లో ఉండాలి"; "స్త్రీ త్యాగమూర్తి, ఎన్ని బాధలైనా గుండెల్లో దాచుకుని, శాంత గంభీర చిరునవ్వులే వెదజల్లాలి" వగైరా 'నాన్నగారి, తాతగారి' కాలం నాటి భావాలు ఈనాటి సమాజాన్ని ఏమాత్రం అర్థంచేసుకున్నవాళ్ళైనా (సిగ్గూ, లజ్జాఉంటే) అంటారా ?

రెండో రకం రచయిత (త్రు) ల్లో కూడా కొంత వైవిధ్యం ఉంది.

"కండక్టరు కొడుకు కలెక్టరు కావచ్చు; ముష్టివాడి కొడుకు మినిష్టరవచ్చు; కూలివాడి కొడుకు కంపెనీలు నడపొచ్చు; రిక్షావాడి కొడుకు కోటీశ్వరుడే కావచ్చు"– యిలాంటి సందేశాలిచ్చే నవలలు ప్రజా చైతన్యంపట్ల నిగూఢ శత్రువులు, ఎవరికి వారు బాగుపడే ఉపాయాలు, ఎవరికి వారు బాగుపడాలనే నీతులు చెప్పడంవల్ల సమష్టి శక్తి విచ్ఛిన్నమౌతుంది. "ఎవరి సమస్యలు వాళ్ళవే; ఎవరి సుఖ దుఃఖాలు వాళ్ళవే; ఎవరి మంచి చెడ్డలు వాళ్ళవే; ఎవరి అదృష్టం వాళ్ళది; మరొకరి సంగతి అనవసరం; నా అవసరానికి పనికొచ్చే వాడితో తప్ప మరోడితో నాకు సంబంధం ఎందుకు ?" అనే భావాలు ప్రతిపాదించే నవలలు సమాజ పతనాన్ని కాంక్షిస్తున్నాయి. అరాచకాన్ని ఆహ్వానిస్తున్నాయి.

ప్రస్తుతం మధ్యతరగతి పాఠకుల్లో చాలా పాప్యులర్‌గా ఉంటున్న 'సస్పెన్స్ రాణి' యద్దనపూడి సులోచనారాణిగారు రెండాకు లెక్కువే చదివేరు. ఈవిడకి ఒక

ప్రత్యేక వర్గం (ధనిక వర్గం) పట్ల రాజకీయంగా కమిట్‌మెంట్ ఉంది. ఆ వర్గ రాజకీయ, తాత్విక చింతనని ఎంతో విశ్వాసంతో, మరెంతో నేర్పుతో మధ్యతరగతి పాఠకుడిలోకి ఎక్కిస్తుంది. కాదని దబాయిస్తే 'జీవన తరంగాలు' నవలలోని ఈ రెండు పేరాలూ ఉదాహరణగా చూపిస్తాను.

"అత్యాచారాలు, కుట్ర, ద్రోహం, లంచగొండితనం, అవినీతి మొదలైన అంటువ్యాధులతో మురిగిపోతున్న ఈ లోకం అసలు మనిషికి నివాసయోగ్యంగా లేదని, యింతకంటే కారడవులు నయం అని అతని నిశ్చితాభిప్రాయం. అతను కోరుకునే విశ్వమానవ కళ్యాణం, సర్వ సమానత్వం యిప్పుడు కాదు, ఈ భూమిమీద యింకెప్పటికీ రాదని అందరికీ తెలుసు."

"... అక్కడినించి చూస్తే, వీధిలో రోడ్డు కిరుప్రక్కలావున్న యిళ్ళు అందంగా, హుందాగా తాము శ్రీమంతుల నిలయాలమని సగర్వంగా చాటుకుంటున్నట్టుగా వున్నాయి.... రోజా మనోవీధిలో తాముండే వీధికి, ఈ వీధికి గల తేడా కన్పించింది. ఒక్కసారి అక్కడి వాళ్ళంతా యిక్కడికి వచ్చేసి, వాళ్ళ యిళ్ళల్లో జొరబడి, వాళ్ళందర్నీ తన్ని బైటికి తరిమేస్తే? ఎవరైనా దేశాన్ని నియంతగా పరిపాలిస్తూ భాగ్యవంతులందరినీ పూరి పాకల్లో వుండవలసిందిగా ఆజ్ఞాపిస్తే? వాళ్ళందరినీ నాలుగు రోజులపాటు అన్నం తినకూడదని, ఐదు రోజులపాటు స్నానం చేయవద్దని, వుదయంనించి సాయంత్రం వరకూ ఎర్రటి ఎండలో కాళ్ళజోళ్ళు లేకుండా పరుగెత్తవలసిందిగా ఆంక్ష విధిస్తే? అప్పుడు తనలాటి వాళ్ళంతా, ఇలా ఉన్నతంగా ఉన్న యిళ్ళల్లో మేడలమీదికి ఎక్కి వాళ్ళని చూస్తూ చప్పట్లు చరుస్తూ విరగబడి నవ్వాలి. అలా నవ్వగలిగిన రోజున తనలాటి వాళ్ళకెంత ఆనందంగా ఉంటుంది.

రోజాకి తనేమాలోచిస్తుందో గుర్తుకి వచ్చేసరికి తనకితానే సిగ్గుపడింది. ఏమాలోచిస్తుంది తను? యిలాటి కుంటి, గుడ్డి ఆలోచన కంతటికీ మూలకారణం ఈర్ష్య. ఈ ప్రపంచంలో వున్న అన్ని వ్యాధుల్లోకీ యీర్ష్యలాటి మరో భయంకరమైన వ్యాధి యింకేదీ లేదు. ఈ వ్యాధి సోకిన వాళ్ళకి కళ్ళు వుండి కూడా దృష్టి వుండదు. మనసు వుండికూడా మమత నశిస్తుంది. మెదడు వుండికూడా జ్ఞాపకం వుండదు. వివేకం గల ఏమనిషీ ఈ జబ్బుని దరిదాపుల్లోకి రానివ్వకూడదు.

ఈవిడ పాత్రలన్నిటికీ 'వ్యక్తిత్వాలు' ముఖ్యం. ఈవిడ సృష్టించే మగ పాత్రలంటే యిష్టపడే ఆడవాళ్ళు చాలా మంది ఉన్నారు. ఆ మగ పాత్రలనేవి స్త్రీ పాత్రల 'అహం'కారాన్ని వదలగొట్టి, పూర్తిగా తమ ప్రభావంకిందికి తెచ్చుకొని 'వ్యక్తిత్వం

ఉన్న బానిసలు'గా తయారుచేసుకుంటాయి. వ్యక్తిత్వంఉన్న బానిసలు కావడం అంటే మన స్త్రీ పాఠకులకి చాలా యిష్టం కాబోసు! అందుకో కారణం ఉంది. ఒక పక్క స్త్రీ స్వాతంత్ర్యోద్యమాలు స్త్రీలలో ప్రత్యేక వ్యక్తిత్వం పట్ల ఆసక్తిని కలగజేస్తుండగా, స్త్రీకి యింతవరకూ ఆర్థిక స్వాతంత్ర్యంగాని, సాంఘిక భద్రతగాని ఏర్పడలేదు.

వ్యక్తి దృక్పథంతో నవలలు రాసిన మరో రచయిత్రి శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారు. ఈ దృక్పథంతో రాస్తే మిగతా రచయిత(త్రు)లకీ, ఈమెకీ తేడా ఎక్కడంటే, ఈ రచయిత్రికి సమాజంపట్ల తన బాధ్యత తెలుసు. మానవ సమాజంలోని లోపాలు భగవన్నిర్ణయాలు కాని, విధి నిర్ణయాలు కాని కావని ఈవిడకి తెలుసు. దానికి మనుష్యులే బాధ్యులైనప్పుడు ఆ లోపాలు పోయేలాగ సమాజం మారాలంటే, అందుకూ మానవయత్నమే కావాలనికూడా ఆమెకితెలుసు. తన జీవితానికి సంబంధించినంతవరకూ ప్రతి వ్యక్తీ అటువంటి ప్రయత్నం చేసేస్తే సమస్యలన్నీ తీరి పోతాయని ఆవిడ అభిప్రాయం. ఎంత నిజాయితీ కలిగిన రచయితకైనా, మార్క్సిస్టు దృక్పథంలేకపోతే ఈనాడు అరాచకానికి దారితీసే భావాలే కలుగుతాయనేందుకు శ్రీమతి రంగనాయకమ్మగారు ఒక చక్కని ఉదాహరణ.

వాళ్ళందరికీ పూర్తిగా భిన్నమైన దృక్పథంతో నవలలు రాస్తున్న బీనాదేవి, రా. వి. శాస్త్రి వంటి వారున్నారు. వీరు వ్యక్తుల్ని సమాజంలో భాగంగా భావిస్తూ, సమాజ వ్యవస్థలోని సాంఘిక, ఆర్థిక, రాజకీయ శక్తుల వైరుధ్యాలనీ, సంఘర్షణనీ చారిత్రిక దృష్టితోనూ, శాస్త్రీయ దృక్పథంతోనూ పరిశీలించి ఆ ప్రభావం వ్యక్తుల జీవితాలమీద ఎలాగ పనిచేస్తోందో తెలియజేస్తారు.

రా. వి. శాస్త్రిగారి 'రాజు-మహిషి' నవలలోని సామాజిక చిత్రణ ప్రపంచ సాహిత్యంలోని గొప్ప నవలలు కొన్నింటికి దీటుగా ఉంది. సమాజంలో లేచే, లేచి పడిపోయే, లేచి ముందుకుపోయే ప్రతి చిన్న పెద్ద కెరటాన్నీ 'డైరెక్షన్ - వెలాసిటి - మేగ్నిట్యూడ్'లతో సహా చూపిస్తారు. ప్రతి కెరటం, ఒక సామాజిక శక్తికి ప్రతిబింబం. (ఈ నవల ఎప్పటికీ పూర్తికాదేమోనని కొందరు భయపడుతున్నారు. ఎటువంటి భయాలనేనా పోగొట్టవలసిన బాధ్యత రచయితదే!) "పుణ్యభూమీ కళ్ళుతెరు" నవలలో జీవిత సత్యాన్ని బలంగా నిరూపించ గలిగేరు బీనాదేవి.

ఈ పరిస్థితుల్లో విప్లవ రచయిత లేం చెయ్యాలి? అనే ప్రశ్న మనం వేసు కోవాలి. తామర తంపరగా వస్తున్న నవలల్ని తీవ్రంగా విమర్శించడం మొదటి కర్తవ్యం. ఈ నవలలవల్ల పాఠకుల్లో కలిగే భ్రమలని పోగొట్టడానికి విమర్శ ఎంతో

అవసరం. అటువంటి విమర్శ సృజనాత్మక చర్య కాకపోవచ్చు కాని, ముందు ముందు నవల విషయంలో విప్లవ రచయితలు చేపట్టే సృజనాత్మక కార్యక్రమం సత్ఫలితాలు సాధించడానికి విమర్శలు అవసరం.

తెలుగు నవలని యిప్పుడున్న రొంపిలోంచి బైటికి లాగడానికి కొన్ని ప్రయత్నాలు ప్రయోగాలు జరిగేయి. దాశరథి రంగాచార్యగారి నవల యిటువంటి ప్రయత్నమే. నవీన్ చేసిన ప్రయోగం 'అంపశయ్య'. ప్రయోగం అంటూ ఒకటి చేసినందుకు నవీన్‌ని అభినందించాలేమో కాని, ఆ ప్రయత్నంలోని పరమార్థాన్ని హర్షించలేము. యిరవై నాలుగ్గంటల్లో జరిగిన కథగా రాయడంవల్ల సాధించ దల్చుకున్న ప్రయోజనం ఏమిటో ఊహించడం కష్టం. 'అలాగ యింతవరకూ తెలుగులో నవీన్ తప్ప మరెవరూ చెయ్యలేదు' అనిపించుకోవడం ఒక అర్థంలేని ప్రత్యేకత (dubious distinction). ఈనాటి యువతరంలో చెలరేగుతున్న **అశాంతిని** కొంతవరకు పరిచయం చెయ్యగలిగేడు నవీన్.

ఈ ప్రయత్నాలూ, ప్రయోగాలూ అస్తవ్యస్తంగా కాక, ఒక నిర్మాణాత్మక కార్యక్రమంగా రూపొందాలి. కుటుంబరావుగారి నవలల్ని, రా. వి. శాస్త్రిగారి నవలా భాగాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, తెలుగు నవల మరో అడుగు ముందుకి వేసేలాగ పరిణామం సాధించాలి. యిందుకు వ్యక్తిగతంగా రచయితలు చెయ్యవలసిన కృషి మాత్రమే కాకుండా రచయితలందరి సమిష్టి కృషి కూడా చాలా అవసరం.

"ప్రజల్ని ఆకలితో మాడ్చి
చంపుతున్న వాళ్ళని
ప్రజలు బందూకులతో
కాల్చి చంపుతారు"

— జ్వాలిత్

## రాజు మహిషి - ఒక పరిశీలన

లక్ష్మీపతి

"నవల కేవలం కల్పనారచనకాదు, అది మానవ జీవితరచన. సంపూర్ణమానవుణ్ణి తీసికొని అతన్ని వ్యక్తీకరించటానికిచేసిన మొట్టమొదటి కళాప్రక్రియ నవల".

— రాల్ఫ్ ఫాక్స్

నవలారచనకు ప్రాథమికఅర్హత: (a curiosity about men and women[1]) మనుష్యులపట్ల కుతూహలం, ఉత్సుకత. దానితోపాటు ఇ.యం. ఫాస్టర్ పెట్టిన షరతు 50,000 శబ్దాల్లో(దాదాపు 250పుటలు)కథను చెప్పగలశక్తి(మించరాదనే నియమంలేదు). తెలుగు దేశం, తెలుగుభాష అదృష్టవశాత్తు ఈరెండు యోగ్యతలుగల రచయితలు, రచయిత్రిలు 'ఏక్‌ధూంధోతో హజార్ మిల్తేహైం'గా ఉన్నారు. ఈ పరిశీలనాశక్తి ఒక మాదిరి భాషాజ్ఞానం సాయంతో మన రచకులు Second-rate emotions and adolescent relationships[2] ను పంచరంగుల వర్ణనలతో తామువిన్నవీ కన్నవీ పుంఖానుపుంఖంగా దేశంమీద వదుల్తున్నారు. భావుకులైన పాఠకులు వారినీ వారి రచనలనూ పోషిస్తూ ఆదరిస్తూనే ఉన్నారు(?). అయినా ఆదరించక వీరు చేయగలిగిందేముంది గనుక; వీరికి కావలసిందా లభించదు, కనుక లభించిందే శ్రేష్ఠమనుకుంటూ ఇష్టపడక తప్పనిపరిస్థితి. కాగా, ఈ వ్యవస్థ జీవితాన్ని ఒక నిర్వీర్యమైన రూపంలో వక్రంగా చిత్రించగలదేతప్ప, నవలాప్రక్రియకు తానే జన్మనిచ్చినప్పటికీ, వాస్తవికచిత్రణచేయజాలదు; అలా చేయగలసత్తా ఉన్నవారికి ప్రోత్సాహమివ్వదమటుంచి అలాంటిరచనలను పైకిరానివ్వదు.

అయితే ఈ రెండు అర్హతలున్నంతమాత్రంచేతనే నిజమైన హితకారియైనసృష్టి జరుగదు. గూడ్సువ్యాగన్లకొద్దీ మంచి ఆకర్షణీయమైన గెటప్‌మాత్రం ఉన్న (అందుకే మనసమీక్షకులు మిగతావిషయాలెట్లున్నా గెటప్‌గురించిమాత్రం చాల ప్రోత్సాహకరంగా పేర్కొంటారు)పుస్తకాలు ఉత్పత్తికావచ్చు. నిజమైన సాహిత్యస్రష్టకు వాస్తవపరిస్థితుల అవగాహన, సత్యదర్శనశక్తి మెండుగాఉండాలి. ఈ శక్తి ఏవోకొన్ని సాహిత్యక లేదా దార్శనిక రూపాలను, ధోరణులను అంటిపెట్టుకున్నందువలనగాని లేక నిరూపమైన

---

1 Novel and the People - Relph Fox P. 83

2 ibid - P. 53

తార్కిక ఆలోచనలద్వారాగాని, లేదా కొందరు బాబాలనే అంతర్దృష్టి (intuition) ద్వారాగాని సంక్రమించదు. ఈ అవగాహన, జ్ఞానం కేవలం సామాజిక, సృజనాత్మక కార్యకలాపాలతో ముడివడివుంది ఫాక్స్ తన పుస్తకం(Novel and the People) "నావల్ అండ్ ది పీపుల్"లో పొందుపరచిన లెనిన్ అమూల్యాభిప్రాయంయిది.

"కళాకారుడు తప్పకుండా సత్యంగురించే పట్టించుకోవాలి. వాస్తవికతకు సంబంధించిన అన్ని అంశాలనుంచి వాని పరస్పర సంబంధాలనుంచీ సత్యం ఆవిర్భవిస్తుంది. ప్రతి కళాకారునికి ఖచ్చితంగా అవసరమైన విషయమేమిటంటే లక్ష్యానికి, శాశ్వతమైన యెడతెగిని గమ్యం జ్ఞానం. మనిషి ఆలోచనలో ప్రకృతి పాత్ర గురించి వ్యక్తీకరణ మృతప్రాయంగానో, అరూపంగానో, నిశ్చలంగానో, వైరుధ్యాలులేకుండానో కాకుండా ఎల్లప్పుడూ చలిస్తూ, ఉదయిస్తూ యేర్పడే వైరుధ్యాలు వాటి పరిష్కారాలుగా అర్థం చేసుకోబడాలి."

సత్యం కేవలం నిత్య సంఘర్షణశీలియైన జీవితం నుండి ఆవిర్భవిస్తుంది, వాటి పరిష్కారాల్లో నుండి ఆవిర్భవిస్తుంది. ఈ సత్యాన్ని దర్శించగలవాడే గొప్ప రచయిత. దీనితోపాటు ఫాక్స్ అన్నట్లు పాత్రలను సాధారణీకరించే శక్తి (జీవితంపట్లగల తాత్విక దృష్టి వలన పుట్టినది) అత్యవసరమైన మరో అంశం. వాస్తవానికి తత్త్వవేత్త నవలాకారుడు కాకున్నా నవలాకారుడైనవాడు తత్త్వ వేత్త అయిఉండి తీరాలి. అప్పుడే జీవితాన్ని గురించి వ్యాఖ్యానించగలడు.

ఈ అంశాలన్నీ అవసరమైన పాళ్లలో కలగలసి సమ్యగ్సాహిత్య సృష్టయే రావి శాస్త్రి. 'అల్పజీవి' తరువాత ఈయన సుదీర్ఘంగా hibernation లోకి వెళ్లిపోయాడు. ఈనాడు మళ్లీ దైవం, న్యాయం, ధర్మం, సత్యం గురించి తిరుగులేని సత్యాలను చెప్పడానికి రాజు-మహిషి రాశారు. బీటలువారిన సాహిత్య క్షేత్రంపై ఇది అమృతవర్షం అనడం సబబే కాని ఆకొన్న సమాజానికిది పుష్టికరమైన సాహిత్యాహారం అనడం నిజానికి దగ్గరమాటవుతుంది (with apologies to రావి).

ఈ నవలలో సామాజిక జీవితానికి సంబంధించిన దాదాపు అన్నిరకాలైన సమస్యలూ దర్శనమిస్తాయి(ఇంకా ఇది మొదటిభాగంమాత్రమే). ఇందులోలేని ఏసమస్యా జీవితంలో కనిపించదు అంటే అతిశయోక్తిఅనిపించవచ్చు. కానిఅదికేవలం అతిశయోక్తిని బోలిన స్వభావోక్తి. ఇది సంక్షిప్త ప్రపంచ స్వరూపం (World in miniature) దీంట్లో జీవితంలోని సమస్త వృత్తుల వాళ్లు కనిపిస్తారు. ఇందులో స్వతంత్రులున్నారు, సేవకులున్నారు, విద్యార్థులున్నారు. వారి ఫ్యాషనబుల్ వగలమాట లున్నాయి, కిల్లీ.

కొట్లున్నాయి, శృంగారపు కీచులాటలున్నాయి, అధికారులైన దొరలు (దొరలైన అధికారులు) న్నారు. పీనుగ్గుమాస్తాలున్నారు, యూనియన్‌లున్నాయి, యూనియన్ లీడర్లున్నారు, వెన్నుపోటు పొడిచే చిట్టిబాబులున్నారు, రోగాలున్నాయి, డాక్టర్లున్నారు, 'మందులు'న్నాయి. దైవభక్తి, సమయానుకూలంగా దేశభక్తిగా మారే ప్రభుభక్తి, ఎన్నికలు, కోర్టులు, లిటిగేషన్లు ఇంకా ఎన్నో ఎన్నో ప్రపంచంలో ఉండబడగలవన్నీ ఉన్నాయి. ఇవన్నీ సమగ్రంగా, వీటిని గురించి పాఠకుడు సమగ్రమైన దృక్పథం ఏర్పరచుకోగల విధంగా ఉన్నాయి.

ఇంతటి విస్తృతమైన పరిధిలో అన్ని విషయాల గురించీ సమగ్రంగా చిత్రించగలగడం బహు కష్టమైన, బహుముఖ ప్రతిభాశాలులకు మాత్రమే సాధ్యమయే పని. ఇందుకు ఒక టాల్‌స్టాయ్‌కు, ఒక దోస్తయేవ్‌స్కీకి ఉన్నంత ప్రతిభా సామర్థ్యాలు కావాలి.

వీరగాధలను గొలుసుకథలుగా ఎడతెగకుండా కొరుకుడుపడని భాష (Elevated style- చాల అందమైనమాట) లో చాల భారీయెత్తున రాసే విధానాన్ని ఉద్గ్రంథం అంటారు. పై రచయితల రచనల విషయంలో కూడా ఈ పేరు ప్రయోగిస్తుంటారు. కాని జీవితంలోని అన్ని రంగాలను సమగ్రంగా భారీయెత్తున చిత్రించే రచనను కాస్మిక్ నవల (Cosmic Novel) అనడం ఉచితమని నా భావం. విమర్శకులీవిషయమై ఆలోచించి సరియైన పేరు నిర్ణయించాలి. నేను ఈ నవలను కాస్మిక్ నవల అంటాను.

పట్టుమని రోజుకు రెండు గంటల పాటైనా తనకు ప్రియుడైన వ్యక్తితో తన భావాలనూ, భావోద్రేకాలనూ పంచుకొనజాలని పరిస్థితుల్లో[3] నిరంతరమూ 'ప్రేమ', 'త్యాగము' అనే భేషజపు మాటలతో నిండిన నవలల్లో మగ్గుతున్న వాళ్లకు ఇది షా యొక్క ఆలోచనల రూపకం (Play of Ideas) కోవకు చెందిన (ఆలోచనల నవల) Novel of Ideas అంటే అయోమయంగానే ఉండవచ్చు. ఇది (ఆలోచనల నవల) Novel of Ideas కు స్పష్టమైన ఉదాహరణ.

ఈ నవలలో నాయికా నాయకు లెవరైందీ తేల్చుకోలేము. కేవలం ఒక్క స్త్రీ ఒక్క పురుషుడు కథకు ఆలంబన, ఆధారభూతులైనపుడు నాయికా నాయకులను సుల

---

3 Aspects of the Novel – E. M. Forster P. 53

Forster ఈ విషయంలో ఇంకొక సత్యాన్ని చెప్పాడు.

"నవలలో ప్రేమ యెంతగా గుమ్మరించబడ్డదో మీకందరికీ తెలుసు. ఆ ప్రేమే ఆ నవలకు చాల హానిచేసి అవి విసుగ్గా ఉండటానికి కారణమైందని మీరందరూ నాతో అంగీకరిస్తారనే అనుకుంటాను" అని.

భంగా పోల్చుకోవచ్చు. కాని ఇందులో సాంప్రదాయికార్థంలో నాయకుడుగాని, నాయికగాని కనీసం ఒక ప్రముఖ పురుషపాత్ర (leading man) ప్రముఖ స్త్రీ పాత్ర (leading lady) కాని లేరు. గంగరాజు, రాజమ్మలతో కథాప్రారంభమౌతుందే తప్ప వీరిని ప్రధాన పాత్రలనే అవకాశంలేదు. నవలా ప్రారంభం వీరిపేర్లతో అయిన కారణంగానే నవల పేరులో వీళ్ల పేర్లను చేర్చడం జరిగిందనవచ్చు. (నవల పేరులో ప్రథమార్థం రాజు, మహిషి, ప్రేమ, మనిషి. బహుశ అచ్చు సౌలభ్యంకొరకేమో- మరో కారణం కనిపించడం లేదు- 'రాజు, మహిషి అని మాత్రమే వేశారు).

ఇటీవలి వరకు దాదాపు అన్ని సాహిత్యాల్లోనూ నవలకుగాని, నాటకానికిగాని వాటిలోని ప్రధాన పాత్రపేరే ఆ రచనకు పేరుగా పెట్టడం ఎక్కువ ప్రచారంలోఉన్న పద్ధతి. కథావస్తువును సూచించే పేర్లు పెట్టడం ఆధునికం.[4] రావి శాస్త్రిగారు తమ కథలకు మాదిరిగానే ఈ నవలకుగూడా సుదీర్ఘమైన పేరు పెట్టారు. రాజు, మహిషి, ప్రేమ, మనిషి అంతేకాక దైవం, న్యాయం, ధర్మం, సత్యం. నిజానికి ఇది పూర్తి పేరు కాదు. వీటి opposite sides కూడా చేర్చబడాలి. ఈ నవలలో లేని సమస్య లేదన్నాను. ఆ విషయం నవల పేరు ద్వారానే స్పష్టమౌతుంది. ఇట్లా రచనలో అనేకానేక సమస్యలు ప్రవేశపెట్టి పాఠకుడి మనస్సులో ఆలోచనలను రేకెత్తింప జేయడం 'Novel of Ideas'[5] (ఆలోచనల నవల) కు ప్రధాన లక్షణం.

ఈ నవల తన బాధ్యత బాగా ఎరిగిన రచయిత రాసింది. బాధ్యతనెరిగిన ఏ రచయిత ప్రయోజనరహితంగా రాయడు, కేవలం కళకోసం రాయడు "For art's sake" alone I would not face the toil of writing a single sentence"[6] అని బెర్నార్డ్‌షా ఖండితంగా చెప్పేస్తాడు. పది వేలలో ఏ ఒకరోతప్ప కళకొరకు చదివేవారుండరు. పుస్తకం చదివినా, నాటకం చూసినా పాఠకుడు లేక ప్రేక్షకుడు రచయిత చెప్పేదాన్తో జీవితాన్ని గురించి తన అవగాహనను విస్తృత పరచుకోవడానికే

---

4 మృచ్ఛకటికం చాల ఆధునిక ధోరణి.

5 (ఆలోచనల రూపకం) Play of Ideas సామ్యంతో (ఆలోచనల నవల) Novel of Ideas అంటున్నాను. దాని (Play of Ideas) లక్షణాలనే దీనికీ వర్తింప జేశాను. అలెగ్జాండర్ నైజెల్ (Alexander Nigel) రాసిన Critical commentaries on Arms and the Man, షా Pygmalion సాయంతో దీన్ని గురించి మరికొన్ని విషయాలు తెలుసుకోవచ్చు.

6 Preface to Man and Superman - Shaw

చేస్తాడుతప్ప 'రసగ్రహణచేయడానికో' శుద్ధ విమర్శకావతంసుడుకావడానికో చేయడు.[7] రచనలు ప్రబోధాత్మకంగా ఉండవలసిన విషయంలో షా అభిప్రాయం గమనించదగింది.

"నేర్పడానికి విషయమూ, నేర్చుకోడానికి మనసూ లేనివారు మాత్రమే సాహిత్యం ప్రబోధాత్మకంగా ఉండరాదనే సాహితీవేత్తల అభిప్రాయంతో ఏకీభవిస్తారు".

ఈ విషయమే రచయిత శైలిని ప్రభావితంచేయడం, రూపొందించడంచేస్తుందని షా సరియైన అభిప్రాయం. చెప్పగలదేమైనా ఉన్నపుడే పటిష్టమైన శైలిఏర్పడుతుంది. చెప్పేదంటూ ఒకటుండటమే శైలికి మూలాధారం. జీవితాన్నిగురించి స్పష్టమైన దృక్పథం, చెప్పవలసినవిషయం గురించి నిర్దుష్టమూ నిర్దిష్టమూఅయిన అవగాహన ఉన్నందువలననే ఈయనశైలికింత బలం, జీవం. ఈయనశైలిని అనుకరించేవారిలో విషయం ఉత్కృష్టంకానిసందర్భాల్లో ఆ రచన గడ్డిపరకమాదిరిగా తేలిపోవడం స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది. వస్తుఔన్నత్యంలేనపుడు శైలి ఎంత ఉత్కృష్టంగాఉన్నా- అసలట్లా ఉండడానికి వీలులేదు; శైలిదుస్తులుగాదు చర్మం. ఆ రచన పేలవంగా నీరసంగా ఇంకా సరిగాచెప్పాలంటే అందమైన మనిషి శవంలా ఉంటుంది. ఈయన రచన అందమూ, ఆరోగ్యమూ, మంచి మనసూగల పరోపకారజీవి.

ఈయన వాడేది విశాఖపట్నం మాండలికం, అందులోనూ సామాన్యప్రజానీకం వాడే యాసతోకూడుకున్నదీఅని చెప్పటం అందరికీ తెలిసిందే చెప్పడమౌతుంది. దీని గురించి ఎక్కువ చర్చ చేయను. కాని 'వచనంరాసేవారిలో ఆయన నికరమైనకవి'[8] అనే విషయానికి రుజువుగా రెండు ఉదాహరణలుమాత్రమిస్తాను:

1. రాకండి;
   నాదగ్గరకెవరూ రాకండి;
   నాబట్టలు,
   నాపుస్తకాలు,
   నాచాప, తలగడ, నాదుప్పటీ,
   నాదేహం,
   నాజీవితం.
   నాసమస్తం
   పట్టుకువెళ్ళి కాల్చేయండి.
   నన్నెవరూ తాకకండి.... P. 61

---

7 ibid P. 25

8 'కుటుంబరావుతో ఇంటర్వ్యూ'- సృజన 13, నవంబర్ '69

2. ఈ అద్దాలగూడు తెరిస్తే
ఏ అందాలు కలలు కనిపిస్తాయి?
ఈ రంగుల కిటికీలు తెరిస్తే
ఏపూల సముద్రాలు కనిపిస్తాయి?
ఏపూల బాసలు వినిపిస్తాయి?
ఈ చల్లని గాలులు
ఏ కమ్మని గంధర్వగానాలనెక్కణ్ణించి తెస్తాయి?
ఆ చల్లనిమెత్తని మబ్బుల దూదిపింజలు
ఏ బంగారు వర్షాలు
ఏ అమృతాలజల్లులు కురిపిస్తాయి.
వెదజల్లుతాయి?
నిగనిగలాడే ఆ నీలాకాశానికి
వెనక్కి వెళ్ళిచూస్తే
ఏ సుందరదృశ్యాలు అగుపిస్తాయి
ఏ స్వర్గలోకాలు సాక్షాత్కరిస్తాయి?

రెండు విభిన్నమైన సన్నివేశాలను, మనస్తత్వాలను చిత్రించడానికి భావం భాష ఎట్లా కలగలసి కరగిపోయాయో, అవిభాజ్యమయ్యాయో (దుస్తులుకాదు చర్మం) కూడా వీటిలో చూడవచ్చు.

రావి శాస్త్రి శైలిగురించిన ప్రసక్తి వచ్చినప్పుడు ఆయన ఉపమానాల ఊసెత్తక పోతే అది అసమగ్రమే అవుతుంది. అయితే ఆయన ఉపమానాల గురించి ఇక్కడ సమగ్ర చర్చ చేయలేను, స్థాలీపులకంగా తప్ప. సమగ్ర చర్చ చేయాలంటే ఒక పరిశోధనా గ్రంథం (dissertation) రాయాలి. ఆయన వాడే ఉపమానాలు, శబ్దచిత్రాలు నిరుపమానాలు, అనితరసాధ్యాలు. ఈయన ఉపమానాల్లో ఔచిత్యమే కాక పరిస్థితులపై వ్యాఖ్యానం కూడా ఉంటుంది. అది రాబోయే పరిస్థితులను సూచించేవిగా కూడా ఉంటాయి– (proleptical similes) అనవచ్చు. మచ్చుకు కొన్ని చూడండి.

"రాధ చాలా ఏడ్చింది. నిప్పు సెగకి కొవ్వు కరిగికారినట్టు, ఆమె మెదడులోని మంటకి ఆమె కళ్లు కరిగిపోయి కారిపోతున్నాయా అన్నట్టుగా ఆమె కన్నీరుకార్చింది".
P. 120

"ఆ హాలు గోడలు నీలంగా ఉన్నాయి. గోడల్ని రెండు ట్యూబులైట్సు సాగదీసి వెలిగించిన గాజు పాముల్లా[9] నీలి నీలిగా వెలుగుతున్నాయి. తిని తిని బాగా బలిసిన వింత జంతువుల్లా నాలుగు సోఫాలు నీలంగా నిల్చున్నాయి. వాటి మధ్య లతలు చెక్కిన మేజా ఒకటి వినయంగా వంగి నిల్చొంది. ఆ మేజామీద, అద్దాలు పొదిగిన చక్కని చిక్కని నీలంరంగు జాడీ ఒకటి ముస్తాబై పెద్దలమధ్య భయపడుతూ నిల్చున్న అలనాటి భోగపు కన్నెలా- అసహాయంగా నిల్చొంది. ఆ కన్నెపిల్ల తలలో పువ్వుల్లా, జెయిల్లో పసిపిల్లల్లా ఆ జాడీలోంచి జాలిగా జారిన పూతీగెన పూపిన పూలు— నీలిరంగు పూలు బిక్కు బిక్కు చూస్తున్నాయి"

"ఆమె (ప్రేమ బి.సెన్) తొడుక్కున్న నీలిరంగు జాకెట్టు ప్లాస్టిక్‌పూల గుత్తుల్లా పొంగింది. 'ప్లాస్టిక్' విశేషణంవాడి కృత్రిమతను సూచిస్తున్నాడు చూడండి, ఎంత కొంటెతనం. పే. 25

ఎండలో మండే ఎర్రచీర ఆమెకంటికి అదొక రాక్షసినాలికలా కనిపించింది ...

సిల్వరుచెంబుకి రెండువైపులా అతిచిన్న రంధ్రాలున్నాయి. రెండు చెవుల్లోంచి రక్తంచిమ్మినట్లు ఆచెంబులోంచి దారికడ్డం నీరుచిమ్మింది. పే. 49

చచ్చిన కోటానుకోట్ల నిర్భాగ్యులపగలాగ మండిపోయినవాళ్ల దేహాల పొగలాగ, సమస్త భగవత్సృష్టికీ ఆఖరిదశలాగ ఆమేఘాలు మిక్కిలి భయంకరంగాఉన్నాయి." 51

నవల, ఆ మాటకొస్తే ఏరకపు రచనైనా, శ్రేణి ఆ నవలలో వ్యక్తీకరింపబడిన (ideas) తత్వాన్నీ, గుణాన్నీ (quality) బట్టి ఉంటుంది. ఇందులో రావిశాస్త్రిగారు ప్రకటించిన ఆలోచనలు (ideas) సార్వజనీనమూ సార్వకాలికమూ అయిన శుద్ధ సత్యాలు. ఇందులో ఈయన వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ సూక్తుల (quotations) రూపంగా సేకరించవచ్చు. శరత్ భారతి (పథేర్‌దాబీ)తరువాత(?) ఇన్ని నికరమయిన నికార్సయిన సూక్తులు (quotations) ఉన్న నవల లేదు.

ఈ నవలలో రావిశాస్త్రిగారు దైవాన్ని గురించి చాల విపులంగా దాదాపు నవలలో సర్వవ్యాప్తంగా చర్చించారు. గంగరాజు, రాజమ్మ ('బాగుపడేజనం'లో మెదట్లో (lower-middle class) క్రింది మధ్యతరగతికి తరువాత మధ్యతరగతి (middle class కు చెందినవాళ్లు) భార్యాభర్తలుగా స్థిరపడడానికిముందు రాజమ్మ "మా అప్పైకాని చచ్చిపోతే, అమ్మా, తల్లీ, నూకాలతల్లీ నీకు మేకపోతునిస్తాను, నాలుక్కోశ్లిస్తాను,

---

9 చిన్న విలన్ రంగారావు ప్రతి తలపెంట్రుకా ఒక సన్నని గాజు పాము అయినట్లు నిగనిగ మెరుస్తుంది.

సీరారవికఁఃగుడ్డయిస్తా"ని మొక్కుకుంది. అన్నిటికంటెముఖ్యంగ తను తనఅప్ప చచ్చే లాగ ఎంత సేవచేయాలో 'అంత' సేవాచేస్తుంది. ఎంత సేవచేసినప్పటికీ అప్ప 'ఎలాగా' చావకతప్పదు. అది నూకాలమ్మ ఆజ్ఞ. నూకాలమ్మకి అప్పయెడల ఎందుకంత కోపమో? అప్ప ఏం అపరాధం చేసిందో, అందుకే నూకాలమ్మ అప్పని చంపేసింది. రాజమ్మ శవాన్ని సక్రమంగా పూడ్చిపెట్టేఏర్పాటు చేసింది. అమ్మ ఆజ్ఞ జవదాటడానికి అప్పకి కాని మరెవరిక్కాని వీలెక్కడుంది. ఈ సంఘటనలో నియతివాదం (fatalism) యొక్క బోలుతనం స్పష్టంగా ఎన్నో అసమంజసమైన తర్కాలతో (specious logic) తో చిత్రించారు.

దైవం దైవప్రయోజనాల గురించి భీమసేనరావు (ధనికవర్గం) పాత్ర ద్వారాను మందుల భీముడిద్వారాను స్పష్టంచేశారు. తన లాభానికి దైవానికి ఎంతగానో ఉపయో గించుకోవచ్చని భీమసేనరావుగారు ఏనాడో గ్రహించేరు. అవతలవాణ్ణి అణచిపారేసి అదే దైవనిర్ణయమని (harm–fulness and hollowness of fatalism) దైవన్యాయ మని సమర్థించడానికి దైవం దొరికినంత వీలు ప్రపంచంలో మరేదీ లేదనేవిషయం భీమ సేనరావుగారు ఏనాడో గ్రహించేరు.' ఆయన పాపపుణ్యాల కతీతుడు. 'పాపంచెయ్య టం లాభసాటికాకపోతేనే అతను పాపంచెయ్యకుండా ఉంటాడు. పుణ్యంచెయ్యడంవల్ల తనకి దమ్మిడీఎత్తు లాభం లేకపోతే అతను పుణ్యంచెయ్యనే చెయ్యడు. దైవభక్తి ఉన్న అధికార్లని దైవాన్నినమ్మేజనం ఎక్కువగా నమ్ముతారని అతను తెలుసుకున్నాడు. అందు చేత ఆయన అందరికీ తెలిసేలా పూజలెన్నో చేస్తుంటారు' పవిత్రతగురించికూడా వీళ్ళకుగట్టి కచ్చితమైన నమ్మకాలుంటాయి. పసుపుకొమ్ము నూలుపోగులకంటె బంగా రపు పుస్తెతాడు, దేవాలయాల్లో బంగారపు దేవాలయాలూ, మశీదుల్లో మార్బుల్ మశీ దులూ ఎక్కువ పవిత్రమని వాటినిమాత్రం గౌరవిస్తారు.

తనకు 'అపచారం చేసింది భగవంతుడు కాదు'— అతడేమీ చేయలేడు గనుక— అని గట్టిగా తెలుసు.

బాగుపడదలచుకున్నవాడు కనుక ప్రతిదాంట్లోనూ లాభాన్నే ఆశిస్తాడు. అన్ని ట్లోనూ ఆర్థికదృష్టే ఆఖరికి జీవితభాగస్వామిని ఎన్నిక విషయంలోనూ అంతే, అందు కని వెతికి వెతికి నిరీక్షించి తన ముప్పయ్యో యేట పెళ్లి చేసుకున్నారు. తన బాగు కోసమే ఆయన పెళ్లిచేసుకున్నారు.

నౌకర్లని దయగాచూస్తే ఎంతో ఎక్కువ పని వారిచేత చేయించుకోవచ్చు. కాబట్టే అతను వారియెడల చాల దయగా ఉంటాడు. కాని అమాయకులైన పనివారు ఇలాంటి

వారు నిజంగానే దయాస్వభావులని మోసపోతారు. వారికోసం ప్రాణాలివ్వడమే కాకుండా తమ వర్గం వారికి హాని చెయ్యడానికి కూడా వెనుకాడనంత విశ్వాసపాత్రులౌతారు.

ఈ వర్గంవాళ్లు 'తాము తప్ప సర్వం మిథ్య' అనుకుంటారు. అందుకే శ్రీధర రావుగారు "దేవుణ్ణి ఎవరైనా సరే స్వార్థం కోసం తప్ప మరొకందుకు ప్రార్థించరని సిద్ధాంతీకరిస్తారు."

దైవం వలన ఎన్ని అనర్థాలున్నాయో మందుల భీముడి పాత్రతో మరింత స్పష్టమౌతుంది.

మందుల భీముడు స్వార్థపరులైన మధ్యవర్గీయుల ప్రతీక. ఇతడిలో దైవభక్తి ఉంది. కాని అతడికి దైవమంటే ఉన్న అవగాహనే వేరు. ఇతడిచ్చిన పాపోపన్యాసం మొత్తం నవలలోకి ప్రతిభావంతమైన భాగం. (దీని తరవాత పీనుగ్గుమాస్తా ఉపన్యాసం) తనలాంటి మనుషులకు నిరంతరం పాపాలు జేయ పెట్టుకున్నవారు గనుక 'పాపాలు చమించేడవేఁ భగవంతుడి ఉజ్జోగం. ఎక్కడా ఎవడూ ఏ పాపవూఁ చెయ్యకపోతే భగవంతుడికి ఉజ్జోగం లేదు' అని నమ్ముతాడు. 'పాపం జేసిం తరవాత స్తానంజేసి ఉపాసం ఉండి కోవిలకెళ్లి బేపనోడికి పావల్డబ్బులు పారేసి, దేవుడికో కొబ్బరికాయ, పూజా పుష్పాలూ యిచ్చేసి లెంపలేసుకొని, దండంపెట్టుకొని, దేవుడి ముందు భక్తితో సీమ కంటే శిన్నోడివిగా ఉండు' అని ఉపదేశిస్తాడు. ఆ యెనక.... అ యెనక మళ్లీ పాపాల్చేసి మళ్లి ఇదే కార్యక్రమం రిపీట్ చేయవచ్చు. ఒకసారి అన్నవరంలోను, మరొకసారి ఇంట్లోనూ రెండు సార్లు వ్రతం చేసాడు. వ్రతం చేసేక తను అదివరకు చేసిన పాపానికి ఏదైనా మిగులుంటే ఆ పాపం కాస్తా పూర్తిగా పోయినట్టే అతను భావించేడు. దైవభక్తి బాగా ఎక్కువయిపోవడంతో పాప భీతి పూర్తిగా తుడుచుకుపోతుంది. మనుష్యులుగా మసిలే పిల్లులకీ పులులకీ పాపం అంటే తెలుస్తుంది. వారికి దైవం అంటూ ఒకడుంటాడు. వారు పాపం చెయ్యడానికి వెరువరు దైవానికి జడియరు. వాటికి విరుగుడు తెలుసు కనుక. కాని సాధారణంగా మంచివారీ సత్యాన్ని తెలుసుకునే లోపుగా పాపం దెబ్బకి సగం మంది, తెలుసుకున్నాక మిగిలినవారిలో నూటికి తొంభై మంది గుండె పగిలి చస్తారు. అది ముమ్మందైనా జరక్కుండా ఉండేందుకే రావి శాస్త్రి హెచ్చరిస్తున్నాడు.

దైవాన్ని గురించిన తన అపనమ్మకాన్ని 'రామారావు'ను ఆదర్శ వంతుడైన నాస్తికుడిగా చిత్రించి వ్యక్తపరచాడు రావి.

'బాగుపడే జన'మంతా ఒకే విధంగా ప్రవర్తిస్తారు. వారికి డబ్బే మూలదైవం. ఛేర్మెన్ భీమసేనరావు లాగానే భీముడు కూడా భార్యకంటే ఎక్కువగా దాసిగా బాని

A. Narayana, Teacher



సగా ప్రేమించే కర్రి రాధ ప్రేమలోని లాభాన్నంతా ఖర్చుచేసుకున్నాడు. రాధ ఏదో కాస్త కలిగిన కుటుంబంలో పుట్టినట్లయితే తనకీ ఆమెకీ సంబంధం చెడిపోకుండా ఉండుననుకుంటాడు. 'రంగడికైనా అటువంటి హైక్లాస్ చాన్స్ తగిల్తే అదే సంతోషం' అని పద్మకోసం ప్లాటు వేస్తాడు. శ్రీధరరావు చిలకను వదిలి గెద్దను పెళ్లి చేసుకుంటాడిందుకే.

మిస్ ప్రేమ బి. సెన్ పేరులోని రహస్యం బయటపెట్టడం నెపంగా ప్రేమను గురించి చాల మందికున్న నమ్మకాలను ఛిన్నాభిన్నం చేశాడు. ప్రేమను గురించీ రాధామాధవుల ప్రేమ తత్వాన్ని గురించి, భక్తి గురించీ కటు సత్యాలను చాల వ్యంగ్యంగా చెప్తాడు. ఇక్కడే ఇంకొక విషయం: ప్రేమను మధ్య మధ్య పద్మ అంటూంటే అచ్చుపొరపాటేమోనని మొదట్లో అనిపించినా (24వ పేజీలో పద్మ ప్రవేశం) సరిగ్గా 40 పేజీల తరువాత పేరువెనక రహస్యం 64 లో వివరిస్తూంటే రచయిత ప్రణాళిక ఇంత వివరంగా రాసుకున్నారా అనిపిస్తుంది. (అసలు సినాప్సిస్ రాశారా?) ఈయన Plot construction (నవలా వస్తు నిర్మాణం) లో తీసుకొన్న జాగ్రత్త మరో విషయంలోనూ స్పష్టమౌతుంది. కర్రి రాధ బిడ్డ మంగ మొదటి నుండీ తల్లిని అక్కా అంటుంది. ఈ ఒక్క (key word) 'కీలక పదం' సాయంతో ఆయన కర్రి రాధ చరిత్ర పతనాన్నీ భీముని కపట స్వభావపు పరాకాష్ఠనూ గొప్పగా చిత్రించగలిగారు. ఈ ఒక్క శబ్దం ఆధారంగానే తన బిడ్డను మందుల భీమునికి తార్చి వాణ్ణి తన వద్ద కట్టిపడ వేసుకుందామనుకుంటుంది పురాణాల నుండి తను చేయదలచుకొన్న పనికి ఆధారం చూపుతుంది— రాధకి కృష్ణుడు అల్లుడు కాడా అని. ఈ సంఘటనే పాపోపన్యాసానికి దారితీస్తుంది.

పద్మ కాలేజికి ఓ అందమైన కవివచ్చి పెసరట్టులేకపోతే కాఫీకొట్టేకానట్టు 'ప్రేమలేకపోతే ప్రపంచమేలేదు' (Is it bathos?) అని ఖచ్చితంగా చెప్పాడు. "అవును, నిజం" 'నీవన్నది నిజం నిజం' అని ఆ ఉత్తేజంతోనే కాలేజి వక్తృత్వపు పోటీలో 'ప్రేమేలేకపోతే భగవత్సృష్టిలేదు మానవత్సృష్టిలేదు'అని ఆఖరిపాయింటుగా చెప్పి 'ప్రయిజు' 'ప్రేమ'గా ఖ్యాతిపొందింది. 'మానవత్సృష్టి' ప్రయోగంతో మన యువజనం అజ్ఞానం వ్యంజిస్తున్నాడు (భాషావిషయిక అజ్ఞానంగాదు, సృష్టిగురించింది)

తరువాత 'సావిరహే తవదీనా రాధా' తైలవర్ణచిత్రం చూస్తుంది మన రచయిత వ్యాఖ్యానయుక్తంగా మనమూ చూస్తాము. రాధాకృష్ణుల ప్రేమోదంతంలో పరమాత్మకోసం జీవాత్మపడే వేదనకంటె అందునా ఒక ప్రౌఢ ఒక పురుషుడికోసం పడే వేదన ఎక్కువగా కనిపిస్తుంది, అందులో నూతనపురుషుడికోసం కాకుండా పరపురుషుడికోసం

పడేవేదన. భర్తగల రాధ ఒక డాషింగ్‌యంగ్‌మాన్ లైక్ కిృష్ణగురించి అన్నింటికీ తెగించడం ఆశ్చర్యంకలిగిస్తుంది. యువతికనుక పద్మజకు 'ఎక్సైటింగ్'గా తోస్తుంది.

సాధారణ పఠిజానీకానికి ఇటువంటి వాటిలో భక్తిభావం గోచరించదు. 'కొద్దో గొప్పో కల్చర్' ఉన్నవారు మాత్రమే అందులో ఆత్మ పరమాత్మల సమైక్యతా, ఐక్యత కోసం వాటి ఉన్మాదం— అవేకాక ఇంకా అనేకమైన సొగసులు చూడగలరు (రతి సుఖ సారాల్లోను పయోధర మర్ధనాల్లోను భక్తి భావం చూడగలవారు) వాళ్లు.

నిజానికి ఈ పేృమ గురించి చాల సరియైన మనోవిశ్లేషణాపూర్వక వ్యాఖ్యాన మిచ్చాడు. 'యవ్వనంలో ఉండే శక్తి మనిషి నొకరకమైన దారిని మళ్లిస్తుంది. కలలు కనేస్తారు, కోటలు కట్టేస్తారు, బొమ్మలు గీస్తారు, కథలు రాస్తారు, పాటలు పాడతారు, పాలయాపారంలోకిదిగుతారు, కిల్లీకొట్లు పెడతారు, సోల్జర్లవుతారు, సర్వసంగపరిత్యాగు లవుతారు, ద్వైతమో అద్వైతమో తేల్చుకొందికి పోతారు— యవ్వనంలో అనేక రకాల పనుల్లోకి, వ్యాపారాల్లోకి, రంగాల్లోకి, యుద్ధాల్లోకి, ఉన్మాదాల్లోకి, అన్వేష ణల్లోకి, త్యాగాల్లోకి, తెగింపులోకి, వీర పూజల్లోకి, మహా మృత్యువులోకి— ఎందు లోకో ఒకందులోకి దిగి తీరుతాడు మానవుడు. ఎందులోకి దిగినా దిక్కు పోయినా కాస్త తీరుబాటు ఉంటే చాలు కనీసం పేృమలోకైనా దిగుతాడు. ప్రేమ సోమరిపోతులు సాధించగల అన్నిటికన్నా సులభమైన పని. మనం నిత్య జీవితంలో యువతీ యువ కుల విషయంలో వాడే ప్రేమశబ్దం (కేవలం వ్యక్తిగతం - erotic) విలువ ఇంతకంటె గడ్డిపరక ఎత్తు హెచ్చు ఉండదు.

బాధల విషయంలో బాగా తిని బలిసినవారనే విషయం కూడా చూడండి:

"బాధల తీవ్రిత మనిషి సంస్కారమును బట్టి ఉండును. ఆ దరిదుృనకు పాము కాటువల్ల ఎంత బాధకలిగినదో ఈ పూబోడికి అతి చిన్న నల్లి దెబ్బవలన అంత తీవ్రమైన బాధయూ కలుగవచ్చును.... తిండిలేక, తేనీరులేక చివరకు తమలపాకు పిప్పి కూడా లేక ఆకలి నొప్పిచే నీవు బాధపడుచున్నావు నిజమే. కాని ఆ పెద్ద తల దిండు వంటి తగు మనిషి పరుపుమీద కూర్చొని తనకి గుండె జబ్బు ఉన్నదేమోనను అనుమానముతో అంతగానూ బాధపడుచున్నాడు. అది అబద్ధము కాదే! నీవు పడ్డ అరవైమైళ్ల బాధ నాతడు అర ఫర్లాంగులో పడగలడు.... ఎంత చెట్టుకు అంత గాలి. ఎవరి బాధలు వారివి.... బాధలకు రాజూపేద అను భేదము లేనప్పుడు ఆ రాజు కూడా నీవలెనే పేద వెధవగా మారి దిగజారి పోవలెనని, స్వార్థపరుడా! స్వామి ద్రోహీ నీవు కోరుట మహా పాపముకాదా?" ఎంత ఎక్కువగా సంస్కారం ఉంటే, అంత

చిన్న విషయాలు అంత ఎక్కువగా బాధపెడతాయి.... అందువల్లనే కూలి వాడి ఎండ బాధ కంటె, పెద్దింటి కవీశ్వరుడి నీడ బాధ ఎక్కువగా ఉంటుంది." ఈ తర్కము లోని అర్థరాహిత్యానికి వ్యాఖ్యాన మనవసరం. అధిక్షేపించ దలచుకున్న, అవహేళన చేయదలచుకున్న విషయాలకు నకిలీ గ్రాంథికాన్ని వాడడం రావి శాస్త్రి Stylistic devices లో ఒకటి [9]

ఈ వేదాంతులు చెప్పే సామ్యవాదానికి మరో మచ్చు. 'కూలివాడు కంట్రాక్టరూ ఏకరక్త బంధువులే, రైతూ బుగతా ఒక గోడలోని మన్నే.... కాని– చిక్కెక్కడ వస్తుందంటే కూలిగాడు కష్టపడాలి, ఆ కష్టంలోంచి కంట్రాక్టరు లాభం లాగాలి. రైతు చెమటోడ్చాలి, బుగత సుఖించాలి.'

అందుచేత వేదాంతులు పారమార్థిక దృష్టితో చూస్తే మానవులంతా సమానులే. కాని వ్యావహారిక దృష్టితో చూస్తే సమానులు కారు అన్నారు. సామాన్యులది వ్యావహారిక దృష్టి. మాన్యులది పారమార్థిక (పరమ + అర్థిక) దృష్టి.

వ్యావహారికంగా బాగుపడేవాళ్లంతా ఎట్లా నడుచుకుంటారో ఒక్కొక్క మెట్టే పైకి ఎట్లా పోతారో వివరంగా అనేక సందర్భాల్లో కనిపిస్తుంది, 'తల్లియాదీ, తండ్రియాదీ, పిల్లియాదీ, పెనిమిటయాదీ, అడ్డొచ్చినోణ్నెవుణ్నయినా సరే అణచిపారేయడమే పైకి పోవడానికి మొదటిమెట్టని రాజమ్మ తెలుసుకుంది, 'మసిబూసి మారేడు కాయజేసి, తట్రాయి బుట్రాయి తాటికాయజేసి, చెందాలు పోగుచేసి, కంపెనీలు తయార్జేసి, పిల్లిమీదెలకనీ. ఎలకమీద పిల్లిని రెండింటిమీదా ఇంకో కోతినీ ఎక్కించి మళ్లీ మద్దెని మద్దెవర్తిగ తనే ఉండి, పెళ్లాం సైడు డబ్బులాగి, లొంగినోణ్ని అణిచేసి, లొంగనోడి కాళ్లు పట్టుకొంటేనే భీమసేనరావు పెద్దవాడు కాగలిగాడని తెలుసుకున్నాడు భీముడు. అంతేకాక "దెబ్బకి దొరక్కుండ మన బాక్కోసరం మనం ఏంచేస్తె అదే నాయెం" అనీ తెలుసుకున్నాడు.

"మందని చేరదీసి మనిషికో కత్తిచ్చి లూటీలో వాటాలిచ్చి కూలి జనాన్ని నరికి పారేసి రాజ్యాలు సంపాయించిన డాకూగాళ్లే రాజులనీ, ఇష్టమూర్తి కొడుకులనీ పొగడబడతారు."

ఇట్లా అన్యాయాల్జేసి పెద్దవాళ్లయినవారు పాతపెద్దలు కొత్తపెద్దలు అని రెండు రకాలు. గుమాస్తా కొడుకు గవర్నరయితే, కూలివాని కొడుకు కంట్రాక్టరయితే

9 కపటము, ద్రోహము, దౌర్జన్యము– మానవ జీవితమంతయు ఈ మూడింటితోను కూడుకొనియున్నది. P. 13

వారు పెద్దల్లో చేరుతారు. వారు డబ్బురావడంతో తమ పూర్వవర్గ లక్షణాలు కోల్పోతారు, ఆ వర్గాన్ని చిన్నచూపు చూస్తారు.

ఈ డాకూగాళ్లే డబ్బు సంపాదించి ఉన్నత వంశీయులు, ఉత్తమ వంశీయులు అవుతారు. రారాజు సామంతులుగా, నవాబులకు మేలు గులాములుగా, బ్రిటిషు దొరలకి నమ్మిన బంట్లుగా ఉన్న వీరే ప్రజలందరికీ కొమ్ములు తిరిగిన మేలునాయకులౌతారు. క్రింది వాళ్లను కిందనే అణచిపెడ్తారు; పరరాజుల కాలంలో ప్రభు భక్తులుగానూ ఈ రాజుల కాలంలో రాజభక్తులుగానూ దేశభక్తులుగానూ చలామణీఅవుతారు! వీళ్లే పాగా పెడితే దేవేంద్రుళ్లాగా, పాగా తీసేస్తే దేవగురువులాగా ఉంటారు. ఏనుగులాంటి వారు వీరు.[10] ఇక్కడ రావి శాస్త్రి ఒక వికటమైన వికృతమైన వాస్తవం చెప్పారు. ఈ జీవితంలో పెద్దలకి ప్రమోషన్లు రావాలంటే దేశభక్తి ఉన్నా లేకపోయినా రాజభక్తి మాత్రం ఉండి తీరాలి. ఏదో కార్టూన్‌లో అన్నట్లు 'దేశమంటే మంత్రిలోయ్' అన్నది నిజము.

ఇందులో మధ్యతరగతి మందులు, జడుల స్వభావాన్ని పీనుగ్గుమాస్తా సోదాహరణంగా వివరిస్తాడు. ఈ మధ్యతరగతి ఉద్యోగుల స్వభావాన్నే రావి ఇంతకుముందే 'వేతనశర్మ'లో నిష్కర్షగా బయటపెట్టి ఉద్యోగులందరికీ ఒక షాక్, పెద్ద కుదుపు ఇచ్చాడు,

పీనుగ్గుమాస్తా ఉవాచ :

"మనం ఎవరవోఁ తెలుసా?

మనం ఏ ఎండకి ఆ గొడుగ్గాళ్లం. రాజుగారు సంస్కృతం తప్ప ఇంకేమీ ముట్టుకోరంటే పిలక్కు తాడుకట్టుకొని అదే చదివేం. నవాబుగారు ఉర్దూ అరబ్బీ పారశీకాలు తప్ప మరేమీ పట్టుకోరు ముట్టుకోరంటే జీహాఁ సర్కార్ అన్చెప్పి అబ్బడ్డవాడి కాళ్లా పట్టుకొని కుడినుంచి ఎడమకి ఆ భాషలన్నీ తిక్ల మానుకుని వేదాలకంటే ఎక్కువగా చదివేం. దొరగారికి ఇంగ్లీషు తప్ప ఇంకేదీ నచ్చదు మాట్టాడరంటే, ఎస్సారన్చెప్పి అహోరాత్రాలు నిద్రమానుకుని ఆ భాషేచదివేం. <u>అప్పుడూ ఆ వెధవల వెనకే</u> తిరిగేం, ఇప్పుడూ ఆ వెధవల వెనకే తిరుగుతున్నాం.... అప్పుడూ చిత్తం చిత్తం గాళ్లవేఁ! ఇప్పుడూ చిత్తం చిత్తం గాళ్లవేఁ!.... మనం పులివెనక నక్కగాళ్లవిఁ! అదో గొడ్డుని కొడితే మనకో నాలుగు దుమ్ములు దొరుకుతాయనే కనిపెట్టుకునుంటాం. తెలి

---

10 ఇదే విషయాన్ని వరవరరావు "రాజుగారి కిరీటం తీసివేసి తెల్లటోపీ పెట్టుకుంటే మంత్రి వేషానికి ఎంతబాగా సరిపోయిందని!" వ్యక్తపరచాడు 'స్వాతంత్ర్య రథచక్ర ఘోష' (సృజన నవంబర్ 1967) లో.

సిందా? మనం పులివెనక నక్కవెధవలవి!.... చిత్తం చిత్తం! జై జై! వారు చేసిం దంతా రైట్ రైట్! తెలిసిందా?! అదీ మన పద్ధతి"

వర్గాల స్వభావాన్నీ, వాళ్లు నమ్ముకోవలసిన వాళ్లగురించీ రావిశాస్త్రి చాల నిర్ద్వం ద్వంగా స్పష్టంగా డైరెక్టుగా చెప్పాడు.

ధర్మంకోసం దెబ్బలాడ్డం పేదింటి పిల్లలకి అవసరం. పెద్దింటి పిల్లలకి అదొక మోజూ, అదొక సరదా.

అందుకే నాయకుడంటాడుఈ వాక్యం, పేదింటి పిల్లలు, డేల్‌కార్నెగీ How to Win Friends లో తరుచు అన్నట్లు అద్దం మీదనో లేదా టోపీలోనో (పెట్టు కునే అలవాటుంటే) అతికించుకోవాలి, నిత్యం మననం చేసుకోవాలి.

"స్నేహితుడా! కష్టించి బతికేవాడు కష్టించి బతికేవాణ్నే నమ్మాలి కాని మరొ కర్ని నమ్మకూడదని తెలుసుకో! కుందేలుకి కుందేలే సాయం చేస్తుంది కాని తోడేలు చెయ్యదు. మధ్య తరగతి మనిషిని మనం నమ్మి ఆశలు పెట్టుకుంటే అవి అడియాస లవుతాయి. ఎండమావులే అవుతాయి. అది మనసు మార్చుకున్న మంచి తోడేలే అయినప్పటికీ మళ్లీ మార్చుకోదనే నమ్మకం మనకి ఏముంటుంది? నువ్వే చెప్పు జాతి కాని జాతికోసం త్యాగాలు చేసేవాడికి ఎప్పుడో ఒకప్పుడు అలా త్యాగాలు చేయడం కష్టమనిపిస్తుంది. కష్టం తోచగానే జాతికాని జాతిమీద విసుగు పుట్టుకొస్తుంది. విసుగు పుట్టుకొచ్చిందంటే అది విషంగా మారుతుంది. మంచి తోడేళ్లు ఉండబోవని కాదు నేననేది, కాని అంతమంచిదైనా కూడా దానికీ పూర్వాశ్రమంలోకి పోదామనే తలంపు ఎప్పుడో ఒకప్పుడు కలగొచ్చు. మనం మరో జాతిని నమ్మి మోసపోయే ప్రమాదం లోకి దిగడంకంటే, మన కుందేటి జాతినే మనం నమ్ముకొని కుంటుకుంటూ నడిచినా అలా నడవడమే మెరుగు"

ఇందులోని ప్రత్యక్షమూ సత్య సంజకెంజాయపార్టీలోకి వచ్చిన పెద్దింటి పిల్లడు చిట్టిబాబు. మనం హైక్లాసా, లోక్లాసా అని ఆత్మపరీక్షచేసుకొని హైకాసేనని నిర్ణయాని కొస్తాడు దాంతో హైక్లాస్‌లో ఉండవలసినవాణ్ని లోక్లాస్‌తోచేరి బాధలుపడ్డం అనవసరం అని పూర్వాశ్రమంలోకి వెళ్లాలని నిశ్చయించుకుంటాడు. ఇలాంటి చిట్టిబాబులు ఎక్కువగా చేరడంతోనే సంజాకెంజయపార్టీ తన ఆదర్శాలను వీడుతుంది. రంగుమార్చక దిక్కుమాత్రం మారుస్తుంది. 'అజ్ఞానపుజనం అది తమపార్టీయేనని అది వెళ్లవలసినదిక్కుకే వెళ్తుందని నమ్ముతూ కూర్చుండిపోయేరు.'

"పెద్దల మనుగడకే ముప్పొచ్చినప్పుడు వారి వారి భేదంబులు వారి ఐక్యతనడ్డజాలవు. వారంతా ఏకమై అడుగున ఉన్నవారిని మరీ అడుగుకే నెట్టడానికి తప్పక ప్రయత్నిస్తారు. వారిమధ్య పెద్దయుద్ధాలుగా ఎదగవలసిన తగవులు రాజీలుగా మారిపోతాయి."

ఇందులో చాలాగొప్ప వాస్తవ వర్ణనలున్నాయి. కిల్లీకొట్టువర్ణన, నరకం వర్ణన వీటిలో పేర్కొనదగినవి. రావిశాస్త్రి రచనలో ఒక విశేషముంది. కథావస్తువులోని సామాజిక అంశాన్ని జీర్ణంచేసుకోవడానికీ సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి మెదడును ఎల్లప్పుడూ సరియైనచోట (Perfect Point) ఉంచుతాడు. దాన్ని బరువెక్కనివ్వడు. ఇంకా ఇంకా అవగాహనచేసుకుంటూనేపోతుంది. సాధారణంగా ఏదైనా బరువైన ఫిలాసఫీపుస్తకం కొద్దిసేపు చదవగానే మెదడు అలసిపోతుంది కాని రా.వి రచన ఎంత ఉన్నతమైన, గహనమైన విషయాన్నైనా అలసట కలక్కుండా చదివించేదిగానే గాక అవగాహన అయేట్లుకూడా ఉంటుంది. ఇందుకతడు హాస్యధోరణిని హాస్యపాత్రలను (సాంప్రదాయిక విదూషకపాత్రలుకావు)కూడా వాడడం ఒక కారణం. అయితే యీ ప్రక్రియ వస్తూద్దీపకంగానే ఉంటుంది తప్ప రచనా లక్ష్యాన్ని దెబ్బతీయదు. హాస్య పాత్రలు నవలలో అవసరాలుగా భాసిస్తాయే తప్ప, అసందర్భంగా (out of Place) అనిపించవు.

జీవితం, జీవితంలో తెలుసుకోదగిన సత్యాలు తరగనివి. యీ నవల జీవితం, (జీవితానికి దర్పణంకాదు).

రావిశాస్త్రిగారి అసంపూర్ణమైన నవలను వీలైనంత తొందరలో పూర్తిచేసి సమాజంపట్ల వారికున్న కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని అందరూ నమ్ముతున్నారు.

సమకాలీనత, (contemporaneity) ఆధునికత (modernity) అనేవి రెండు వేర్వేరు విషయాలు. సమకాలీనతను ఆధునికమైనదిగా అపార్థం చేసుకునేవాళ్లు చాలామంది. అందుకే యువరచయిత అనడాన్ని ఆధునిక రచయిత అని అనడం వింటూ ఉంటాం. ఆధునిక వస్తు సంబంధం, సమకాలీనత సమయసంబంధం. ఈ నవల ఎల్లప్పటికీ ఆధునికంగా నిలచిపోగలది.

సాహిత్య వ్యాసాలు:

## 1. విశ్వసాహిత్యం

గోర్కీ

సాహిత్యం మనం బాగా చదవాలి. దాన్నిగురించి పూర్తిగా తెల్సుకోవాలి.

సమాజ హృదయమే సాహిత్యం. ప్రకృతి అందాలకు ఆవేశపడే మానవుడు దాని నిగూఢ శక్తులకు బెదిరిపోతాడు. అప్పుడు అతనిలో పెల్లుబికే సుఖదుఃఖాలు, కలలు, కోర్కెలు, కోపతాపాలు ఇవే సాహిత్యానికి పట్టుగొమ్మ. ఈ సమాజహృదయం అజరామరంగా స్పందిస్తూనే వుంటుంది, అందులోనే సమస్త విశ్వం, సకల ప్రకృతి శక్తులు వాటి సారాన్ని, పరమార్థాన్ని నిక్షిప్తంచేస్తాయి. ఎందుకంటే మానవుడు ప్రకృతి చిక్కులను విప్పగలిగేదీ. దాని కారణాలను గొప్పగా చెప్పగలిగేదీ ఒక్క సాహిత్యంద్వారానే.

లోకాన్నంతటినీ అవలోకించే నేత్రమే సాహిత్యం. ఈ నేత్రం మానవుడి మనస్సులోని అతినిగూఢరహస్యాల్లోకి దృష్టిసారిస్తుంది. 'పుస్తకం' అంటే మనందరికి మామూలుగా తెలుసు. కాని నిజానికి 'పుస్తకం' ఈ ప్రపంచంలో ఒక గొప్ప వింత. ఎందుకంటే, ఎవరో మనకు తెలియనివాళ్లు, మనకు తెలియనిభాషలో, ఎన్నో వేలమైళ్ల దూరానవుండి కాగితంమీద ఏమేమో చుక్కలు, గీతలుగీస్తారు. వాటినే మనం అక్షరాలంటాం. ఆ రచయిత ముక్కుమొహం మనం ఎరగం. కాని ఆపేజీలు తిరగేసి, ఆ చుక్కలు గీతలుచూసి అతని శబ్దాలు, అర్థాలు, అనుభూతులు. మనోరూపాలు తెల్సుకుంటాం. అందులోని ప్రకృతి చిత్రణకు మనం ఆనందిస్తాం. శబ్దాలకు, వాటి సంగీతానికి పొంగిపోతాం, అవి ఒక్కోసారి మనని కన్నీరు కార్పిస్తాయి. మరోసారి మనకు కోపం తెప్పిస్తాయి. ఇంకోసారి స్వప్నసీమల్లో, ఆనందడోలికల్లో ఊగిస్తాయి. ఈ రకంగా పుస్తకంలో పేజీలు చదివి అనుభూతి చెందుతాం, అబ్బురపడతాం.

ఆనందం కోసం, ఔన్నత్యం కోసం పురోగమించే మానవుడు చూపించిన మహిమల్లోకల్లా మహత్తరమైంది పుస్తకం.

కాని ప్రపంచ సాహిత్యం అంటూ యింకా ఏర్పడలేదు. ఎందుకంటే అందరికీ తెలిసే ప్రపంచభాష ఏదీలేదుకనక. కాని ఉత్తమ సాహిత్యంలోని ఉద్రేకాలు, ఆలోచనలు, భావాలు అందరికీ చెందేవే. ఆనందంకోసం, ఆత్మ స్వాతంత్ర్యంకోసం మాన

వుడుచేసే కృషి అంతటా ఒకటే. జీవితంలో ఒడిదుడుకులు, జీవితాశలు, శద్ధాలకు, భావాలకు అందని మానవుడి ప్రేమ ఒక్కలాగేవుంటాయి. ఒకోసారి వుద్రేకాన్నికూడా మించిపోతుంది ప్రేమ ఈ ప్రేమ మనగుండెల్లోకాంతులు చిమ్ముతుంది. ప్రేమలోతులు తరిచిచూచే సాహిత్యాన్ని 'సౌందర్యోపాసనతో ముడిపెట్టడంచాలా పేలవమనిపిస్తుంది.

ఈ భూగోళంలో బాహ్యలోకంతోపాటు ఓ అంతర్లోకంకూడా వుంది. అదే మన చైతన్యంలోని రంగుల లోకం. ఆ చైతన్యంలోనుంచే మనం ఎన్నో అల్లాం. ఎంతో అందాన్ని పోత పోశాం. అందులోనుంచే గొప్పభావాలు పుట్టాయి. యంత్రాగారాలు కట్టాం. గుట్టలు పగలగొట్టి గుళ్లుకట్టాం. తొలిచి సొరంగాలు తవ్వాం. ఉక్కుకుప్పలు పోసి నదులమీద వంతెనలు నిర్మించాం. ఆ వంతెనలు అలవోకగా గాలిలో తేలిపోతున్నాయి (hanging bridges). మన శక్తి సామర్థ్యాలనుంచే మహనీయ, మధుర, మహత్తర, మంజుల జీవితగానం జాలువారుతుంది.

అజ్ఞాన తమస్సును చీల్చుకుని హేతువాదం, కార్యదీక్ష అనే ఆశారేఖలు వెలుగొందుతాయి. వాటివల్లనే పాశవికతను, ఆటవికతను జయిస్తాడు మానవుడు. అప్పుడే మనం మానవులం అని సగర్వంగా చెప్పుకోవచ్చు. భూగోళంమీద మనంచేసిన గొప్ప పనులను చూపించవచ్చు. అవన్నీ మన సాహిత్యంలో, శాస్త్రగ్రంథాల్లో కళ్లు మిరుమిట్లుగొల్పేలా కనిపిస్తాయి

సాహిత్యం గొప్ప మేలుచేస్తుంది. మన చైతన్యంలోతులను పెంచి, మన జీవితానుభవాలను విశాలంచేసి, మన వుద్రేకాలను పొంగులువారించి మనకోసంగతి తేటతెల్లంచేస్తుంది సాహిత్యం- మనమాటలు, చేతలు, మన భావజగత్తు అంతా మానవుడి నెత్తురునుంచి, నరాలనుంచి పుట్టినవేనని.

ఎప్పుడూ అందరూ అన్నిభాషల్లో ఒక సంగతే మాట్లాడతారు— తమను గురించి, తమ బ్రతుకు గురించి, మామూలు మానవుడి కోర్కెలు అంతటా ఒకటే. బుద్ధి వికాసంలో మాత్రం తేడాలు వుండవచ్చు.

ఈ పోలికలు, తేడాలు సాహిత్యంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. సాహిత్యం జీవిత దర్పణం. అందులో అన్నీ ప్రతిబింబిస్తాయి, మన తీరనిబాధ, ఆరనికోపం, ఛార్లెస్ డికెన్స్ చతురోక్తులు, డోస్టావస్కీ వికటాట్టహాసం. మన మనః ప్రపంచపు భావర్తాలు, మన కామనలు, మనలో పేరుకున్న కుళ్ళు, మూర్ఖత్వం, పాడుకున్న నీచత్వం, మన వీరత్వం, మన భీరుత్వం, మన ధైర్యలక్ష్మి, మన ద్వేషాగ్ని, మన కౌటిల్యం. అంతులేని మన అబద్ధాలు, ఆత్మ శ్లాఘన, వంచన, దుష్ట పరివారం,

మన కల్లోలాలు, మిణుకు మిణుకుమనే మన ఆశలు, కమ్మని మన కలలు, ఈ ప్రపంచంలో జరిగేవి, మన గుండెల్లో మెదిలేవి అన్నీ సాహిత్య దర్పణంలో ప్రతిబింబిస్తాయి. సాహిత్యం సున్నితమైన స్నేహితుడిలాగాను, నిశితమైన న్యాయమూర్తిలాగాను సానుభూతి చూపించి, ఎగతాళి చేసి, మన వెన్ను చరిచి, మన నిష్ప్రయోజకత్వాన్ని నిరసించి, జీవితంకన్నా ఒక మెట్టు పైనుండి సైన్సుతోపాటు మానవాళికి మంచి దారి చూపుతుంది.

శబ్దాల్లో, రూపాల్లో కనిపించేది మానవుడి లోటుపాట్లుకావు, జీవితాన్ని మెరుగు పర్చడానికి నిరంతరం అతను చేసే కృషి. అంతే కాదు, దైన్యాన్నుంచి విముక్తి చెందాలని కూడా కోరుకుంటాడు. మానవుడు పరిస్థితుల చేతిలో కీలుబొమ్మకాదు, పరిస్థితులను మార్చివేసి, మలుచుకోగల దిట్ట. స్వేచ్ఛా జీవి. జీవిత సృష్టికర్త. ఈ అర్థంలో సాహిత్యం నిత్యం విప్లవాత్మకమే.

మామూలు విషయాలకన్నా కొంచెం ఎత్తులో వుంటుంది సాహిత్యం. అందు కోసం ప్రతిభావంతు లెందరో ఎంతో కృషిచేస్తారు. అందులో మానవత్వం తొణికిస లాడుతుంది. ప్రేమోద్రిక్తత ద్వేషాగ్నికి కారణమవుతుంది. అందువల్లనే సాహిత్యం మానవ జాతిపై మోపే అభియోగం కాదు. మానవజాతి ఆత్మ సమర్థన. సాహిత్యం దృష్టినుంచి చూస్తే జీవితంలోని వైరుధ్యాలు దేశాల మధ్య, వర్గాల మధ్య, వ్యక్తులమధ్య ద్వేషాలు ఇవన్నీ కూడ శతాబ్దాల రోగాలే. ఉదాత్తమైన ప్రజాశక్తి ఈ రోగాలన్నిటిని తుడిచిపెట్టగలదని, తుడిచిపెట్టాలని సాహిత్యం నమ్ముతుంది. అంతేకాదు మానవుడి ఆత్మఔన్నత్యానికి, స్వేచ్ఛా వికాసాలకు అడ్డుతగిలి పశుత్వానికి పట్టంగట్టే అరిష్టాలను కూడా తుడిచిపెట్ట గలదు సాహిత్యం.

శబ్దాలో, రూపాల్లో అవతరించిన ఈ సాహిత్య ప్రవాహం చూస్తే జాతి, దేశ, వర్గభేదాలను ఊడ్చిపారేయడమే ఈ ప్రవాహం ప్రయోజనం అనిపిస్తుంది. ఆ నమ్మకం కూడా కలుగుతుంది. మానవుల మధ్య పరస్పర సంఘర్షణను తొలగించి, వారిని విముక్తులను చేస్తూ, మానవజాతి సమస్త కృషిని నిగూఢ ప్రకృతి శక్తులతో సంఘర్షణకు మళ్ళిస్తుంది సాహిత్యం.

మన ప్రాచీనుల తప్పులు, ఒప్పులు, గొప్పలు, మెప్పులు, వాళ్ళ వేలంవెర్రి, విజయ పరంపర, అన్నీ మనకు పాత సాహిత్యంలో కళ్ళకు కడతాయి. సాహిత్యం మన ఆలోచనలను తీర్చి దిద్ది, మన ఉద్రేకాలను నాజూకుపర్చి, మన మనసును పదను తేర్చి ఓ విశ్వవ్యాప్తమైన పాత్ర నిర్వహిస్తుంది. అన్ని దేశాలను ఒక తాటిమీదకు

తెస్తుంది. అంతర్గతంగా అందరిలో వున్న బాధ, తపన ఒకటేనంటుంది సాహిత్యం. అలాగే నవజీవన నిర్మాణంలో కూడా అందరి కృషి ఒకటేనని చెబుతుంది సాహిత్యం.

మానవుడు ఎంత విజ్ఞానవంతుడైతే అంత పరిపూర్ణుడవుతాడు. అందరి బాధ తన బాధనుకుంటేనే మేలుకలయిక, ఏకత్వం సాధ్యపడతాయి. మరింత వేగంగా మనలోని దానవత్వం నశించి మానవత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం మేల్కొంటాయి.

— అనువాదం: సి. ప్రసాద్

## గురజాల మోతె

అశ్విని

గురజాల మోతె
గురజాల మోతె
ఎక్కడున్నావో
ఎరుగకున్నా నేను
తలయెత్తి నిలిచాను
ఉప్పొంగి పోయాను

* * *

తుంటరి పోలీసు
దుండగం ఎదిరించి
వందలాదిగ మంది
చేరి నిలిచిన ప్రజా
వీరయోధుల్లార
సాయుధుల్లార !

ప్రాణాలనెదురొడ్డి
కంటి పాపల వంటి
పోరాట వీరుల్ని
కార్య శూరుల్ని
కాపాడుకున్నట్టి
వీరయోధుల్లార
సాయుధుల్లార !

పదియేండ్ల పసిపాప
ప్రాణాలు బలిగొన్న
రాక్షసుల ప్రాణాల్ని
నక్కజిత్తుల మారి
తొత్తు కొడుకుల్ని

కసితీర తరిమిన
వీర యోధుల్లార
సాయుధుల్లార !

కలిసికట్టుగ నిలిచి
గోడగా సమకూడి
కట్టెలతో, ఈటెలతొ
బరిసెలతొ, బాకులతొ
సుత్తె కొడవలి ఎర్రజెండాలతో
సూర్యుని బిడ్డలను
కాపాడు కున్నారు
వెలుగు బాటలె
మీరు నిలుపుకున్నారు
పోలీసు మూకలను
తరిమి కొట్టారు
వీర యోధుల్లార
సాయుధుల్లార !

దీపాన్ని నిలుపుటకు
వెలుగు పంచుటకు
ప్రాణాలకై నను
లెక్కచేయని ప్రజా !
దళమె కనుపాపయని
నిలిచి పోరాడిన
కనురెప్పలార
వీర యోధుల్లార
సాయుధుల్లార !

దోపిడీ దారులను
ఎదిరించినపుడెల్ల
పోలీసు మూకలతొ
పోరాడినపుడెల్ల
కడుపు మాడిన జనత
గొంతెత్తినపుడెల్ల

గురజాల మోతియే
బాటగా నిలవాల
గురజాల మోతియే
ఒరవడిని పెట్టాల
గొంతు గొంతున
అదేపాటగా మ్రోగాల!

[24 జూన్ '72న వరంగల్ జిల్లా గురజాల మోతె గ్రామంలో కొన్ని వందల మంది సాయుధులైన ప్రజలు– ఆ గ్రామంలో వున్నారన్న ప్రజాకార్యకర్తల్ని హతమార్చడానికి వచ్చిన పోలీసు బలగాన్ని జయప్రదంగా ఎదిరించారు. పోలీసు మూకల కాల్పులలో ఒక పదియేండ్ల బాలిక మరణించిందని పత్రికలవార్త.]

## పెద్దమనుషులు

అయ్యలార ఆలకించుడయ్య
అమ్మలార ఆలకించుడమ్మ
సోషలిజం పేరు జెప్పి
పేద ప్రజల నోళ్ళుగొట్టి
కలవారికె కట్టబెట్టు
దుర్మార్గపు రాజ్యంలో
పెద్దమనుషులనేవారి
పద్ధతులను వివరింతుము ॥అయ్య॥

ఆగస్టు పదిహేనట
స్వాతంత్ర్యం వచ్చిందట
బ్రిటీషోడి తేయాకు
రబ్బరు – కాఫీ తోటలు
అమెరికోడి పెట్టుబళ్ళు
కార్టెక్సు కంపెనీలు
రష్యావాడి కొత్తప్పులు
రాజ్యమేలుతున్నాయి ॥అయ్య॥

దేశవాళీ సరుకులంట
ఉత్పత్తవుతున్నాయంట
విదేశాల సహాయాన్ని
విసర్జించుతున్నారంట
విమానాల తయారీకి
ఇంజనేమో దిగుమతి
రెక్కలు తోకలు మాత్రమే
ఇక్కడ మన తయారీ ॥అయ్య॥

పెన్సిల్ నిర్మాణానికి
పెద్ద పెద్ద ప్లానులంట
ముక్కలన్నీ దిగుమతి
చెక్క మాత్రమే మనదీ ॥అయ్య॥

సొంత కాళ్ళపైననే
నిలవాలని కబుర్లు
విదేశాల భిక్షంకై
అదేపనిగ టూర్లు
బియ్యానికి బిచ్చమూ
విజ్ఞానం బిచ్చమూ
ఆయుధాల బిచ్చమూ
అన్నిటికీ బిచ్చమే
గడప గడప లన్నింటా
కాళ్ళు అరుగ తిరిగినారు
సిగ్గు ఎగ్గు లన్ని విడచి
కొంగుపరచి అడిగినారు ॥అయ్య॥

రైతాంగం భూమంతా
భూస్వాముల భుక్తమాయె
వడ్డీ చెల్లించలేక
రైతు నడ్డి విరిగిపోయె
ప్రతిరోజూ పని దొరకదు
చేస్తేనా కూలిరాదు

పిచ్చముంత కొల్లలూ
వెట్టి చాకిరి తప్పదు
భూస్వాముల రాజ్యంలో
బురఖాగిరి పాలనలో
కలవారికి ఆస్తులు
కష్టజీవుల పస్తులు ॥అయ్య॥

కోట్లకు పడగలెత్తుతున్న
కోటీశ్వరులు ఒకవైపు
సొంతమంటు ఏమిలేక
శ్రమశక్తిని అమ్మినా
పూటగడవని గర్భ
దరిద్రులు మరోవైపు ॥అయ్య॥

తింటానికి తిండిలేక
వుంటానికి యిల్లులేక
చేస్తానికి పనుల్లేక
బిచ్చమెత్తి బతకలేక
అందమైన శరీరాలు
అంగట్లో అమ్ముకుంటూ
వ్యభిచారపు గృహాల్లోన
నిర్బంధపు రతిలోన
ఎముకల గూళ్ళయిన
నిర్భాగ్యపు చెల్లెళ్ళు ఎందరో
బందీలై వున్నారు
ఈ ఇందిరమ్మ రాజ్యంలో ॥అయ్య॥

అంతస్థుల మేడలోన
అందమైన గదులలోన
ఎండచూపు లెరుగనట్టి
పండుబోయిన ముఖాలతో
దాస దాసి జనులంతా
వింజామర వీస్తుంటే

హంసతూలికా తల్పంబున
నిద్రరాక మత్తుపోక
పరుపుపైన పొర్లాడే
పరులపైన పడి బ్రతికే
సోమరిపోతుల్ని పెంచి
పోషిస్తుంది రాజ్యం ॥అయ్య॥

పూటగతిలేనివారి
తాటాకు పాకల్లో
సూర్య చంద్ర బింబాలు
తాండవమాడుతునుండు
గట్టిగాను గాలి వీస్తే
ఒక్క ఆకు నిలవదు
వానజల్లు వస్తేనూ
గుడిసె ఒక మురికిగుంట ॥అయ్య॥

తిన్న తిండి జీర్ణమవక
తికమక పడుతూ కొందరు
తిండి కొరకు అలమటించి
గడప గడప తిరిగి తిరిగి
రోడ్ల ప్రక్క నిలిపి వున్న
మునిసిపాల్టి తొట్లల్లో
కుళ్ళ విస్తరాకుల్లో
ఎంగిలి మెతుకుల కోసం
కుక్కలతో - పందులతో
ఘోర యుద్ధ మొనరించే
నిర్భాగ్యపు జీవితులకు
నిలయమైనదీ రాజ్యం ॥అయ్య॥

పాపాలకు మేలి ముసుగు
పార్లమెంటు అసెంబ్లీలు
మోసానికి మారుపేరు
దగాకోరు ఎలక్షన్లు
కులం మతం బంధుత్వం

అధికారం దౌర్జన్యం
సారా పీపాలు మొదలు
ఓట్లుకొనే వ్యాపారం
పలురకాల మోసాలు
సులభంగా చేయగలిగే
వున్నవాడిదే విజయం
లేనివాడిది పరాజయం ॥అయ్య॥

శ్రీరంగ నీతు లెన్నొ
చెప్పటంలో కొదువలేదు
హింస పనికిరాదంటూ
మంత్రి జపం చేస్తారు
దేశమంత ఎటుచూసిన
పోలీసుల రాజ్యమాయె
పొలాల్లోన పోలీసులు
ఫ్యాక్టరీల్లో పోలీసులు
కొండల్లో పోలీసులు
ఇండ్లల్లో పోలీసులు
వీధుల్లో పోలీసులు
స్కూళ్ళల్లో పోలీసులు
లాఠీ, తూటాల మోత
ఎటు చూసిన ఎక్కువాయె ॥అయ్య॥

కమ్యూనిజం పేరు జెప్పి
ఎఱ్రగుడ్డ ఎగురవేసి
కల్లబొల్లి కబుర్లాడి
కార్మికులను చేరదీసి
కపట నాటకాలతోడ
కర్షకులను బుజ్జగించి
ఎం ఎల్ ఏ ఓట్లకొరకు
మంత్రి పదవి సీట్లకొరకు
ఇండికేటు ఇందిరో
సిండికేటు లింగపో

ఏదో ఒక కేటుతోడ
వియ్యమందుతున్నారు
నకిలీ కమ్యూనిస్టుల
అసలు రూప మిదేనయ్యా ॥అయ్యా॥

మార్క్స్ మాట మరచినారు
లెనిన్ బాట విడచినారు
స్టాలినంటే గుండె దడ
మావో పేరు మరీ హడల్
పార్లమెంటు ద్వారానే
సోషలిజం తెస్తామని
బొందితోనె కైలాసం
సరాసరి పోతామని
సాగుతున్న పోరాటాలు
ససేమిరా కూడదని
వర్గ శత్రు గొంతుతో
వంత కలిపి పాడినారు ॥అయ్యా॥

మావో ఆలోచనతో
రైతు జనత మేల్కొంది
ఆయుధాన్ని చేతబూని
తిరగబడి పోరుతోంది
కార్మికులు కదిలారు
అగ్రశ్రేణి నిలిచారు
విద్యార్థులు మేధావులు
విప్లవ కళాకారులు
భుజం భుజం కలిపారు
పిడికిలి బిగియించారు
సాగుతోంది పోరాటం
కదిలింది జైత్ర రథం
అదే మన విముక్తి పథం
విజయం మనదే తథ్యం ॥అయ్యా॥

— విప్లవ శంఖారావం సౌజన్యంతో.

# అణగారిన ప్రజలకున్న ఆయుధమే నక్సలిజం

ఎ. ఆర్.

వేల వేల యోధులనూ
పట్టుక బంధించినా
నాయకులను ప్రతి ఒకర్ని
పట్టుక కాల్చేసినా
కనబడితే కాల్చేయమని
ఎన్ని ఆజ్ఞ లిచ్చినా
వెదకి వెదకి చంపాలని
ప్రతి పల్లే గాలించినా
శృంగభంగ మగును మీకు
కంసుని గతి తప్పదులే

అణగారిన ప్రజలకున్న
ఆయుధమే నక్సలిజం
భరత ప్రజల ముక్తిపథం
సాయుధమౌ విప్లవం
ఇది మావో ఆలోచన విధం బలం
ఎంత తుంచి వేసినా, ఎన్నిసార్లు నరికినా
చిలువలేసి పెరుగుతుంది
మహా వృక్ష మౌతుంది

నక్సలైటు గెరిల్లా
మనిషి మాత్రమే కాదు, నశించుటకు
అది భావం, అదో శక్తి, అది విప్లవానలం
వ్యక్తిని బంధించగలరు
శక్తిని బంధించలేరు
అగ్నిని బంధించలేరు
యీ శక్తి, యీ భావం, యీ విప్లవం
వేల వేల రూపాలతో
మరల మరల జనిస్తుంది.

## "ఇప్పుడు వీస్తున్న గాలి" నిషేధం
శాసనమండలి చర్చ

[జూన్ 29న శాసనమండలిలో శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు
సావధాన తీర్మాన చర్చ వివరాలు]

శ్రీ కె. కోటేశ్వరరావు: అధ్యక్షా, 'ఇప్పుడు వీస్తున్న గాలి' అనే పుస్తకమును కొడవటిగంటి కుటుంబరావుగారు ఎడిట్ చేయడం జరిగింది. శ్రీ శ్రీ, నిఖిలేశ్వర్ మొదలైన రచయితలు వ్రాయడం జరిగింది. వరల్డ్ ఫేక్‌లో యిది అవుట్‌స్టాండింగ్ పుస్తకంగా భారత ప్రభుత్వం అంగీకరించడం జరిగింది. అలాంటి పుస్తకాన్ని మన ఆంధ్ర ప్రభుత్వం చూడకుండానే నిషేధించడం చాల విచారకరమైన విషయం. ఒకరి భావాలతో మనం ఏకీభవించకపోవచ్చు- అంతమాత్రాన వారి పుస్తకాలు, వారి భావ ప్రచారం కాకుండా అడ్డు తగలడం అనేది ప్రజాస్వామ్య యుగంలో మంచిది కాదని మనవి చేస్తున్నాను. దీని విషయంలోనే M N. రాయ్ ఒకసారి చెప్పారు. "నేను నీతో ఏకీభవించకపోవచ్చు- అయితే నీ భావాలను ప్రచారం చేసుకోడానికి స్వేచ్ఛగా నీ భావ ప్రకటన చేసుకోడానికి అవసరం ఐతే నా ప్రాణాలు యిస్తాను" అని. ఇది ప్రజాస్వామ్య సూత్రం. అలాంటి సూత్రానికి అడ్డు తగిలి ఈ పుస్తకాన్ని మన ప్రభుత్వం బాన్ చేయడం జరిగింది. ఇది బాన్ చేయడం మంచి పద్ధతి కాదని మనవి చేస్తున్నాను. బి. వి. కేస్కర్‌గారు ఎడిట్ చేసిన బుక్స్ యిండియాలో అది అవుట్ స్టాండింగ్ పబ్లికేషన్ అని భారత దేశంలో మెచ్చుకు తీసుకున్న కొన్ని పబ్లికేషన్స్‌లో చక్కని పుస్తకం అని వారు వర్ణించారు. ఆ విషయం కూడ దీనిలో క్లియర్ చేశారు.

"This is an anthology of sixteen 'revolutionary stories' Edited By Mr: Kodavatiganti Kutumba Rao most of them illustrate the rational of protest against a social and political set up that is Easier ended than mended Besides well known names like, R. Viswanatha sastri, Nikhileswar, Cherabandaraju, and others. Many new writers are also presented here. As the editor has fore warned the reader in his introduction, one has to look here not so much for the art of writing as for the heart of the writer find by the urge for a revolutionary Change."

"ఇది కొ. కు. గారు సంపాదకత్వం వహించిన పదహారు కథల సంకలనం. ఇందులో చాలా కథలు తిరుగుబాటు తత్వాన్ని యిప్పుడున్న సామాజిక రాజకీయ వ్యవస్థను మార్చడం కన్నా నాశనం చేయడం సులభమనే హేతువాదాన్ని చిత్రిస్తున్నాయి. రాచకొండ విశ్వనాథశాస్త్రి, నిఖిలేశ్వర్, చెరబండరాజు వంటి సుప్రసిద్ధ రచయితలెందరో రాశారు. చాల మంది కొత్తరచయితలు కూడా యిందులో వున్నారు. సంపాదకుడు ముందుగానే పీఠికలో హెచ్చరించినట్లుగా యిందులో పాఠకుడు రచనానైపుణ్యం కొరకు వెతకటంకన్న విప్లవాత్మకమైన మార్పు కొరకు, రచయిత హృదయ స్పందన కోసం వెతకటం మంచిది."

ఈ సమాజంలో విప్లవాత్మకమైన మార్పులు రావాలని, నవ సమాజ నిర్మాణం కావాలని అధికారంలోవారు చెప్పడం జరుగుతున్నది. సమాజం ఏ పద్ధతిలో రావాలి, ఈనాడు సమాజంలో కుళ్ళు ఏ విధంగా పేరుకుపోయిందనేది వారు కళ్ళకు కట్టినట్లుగా చిత్రిస్తే దానిని బాన్‌చేయడం మంచి పద్ధతి కాదని, వెంటనే ఈ పుస్తకంమీద నిషేధం తొలగించాలని మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను. నిషేధించడానికి కారణాలు ఏమిటి? ఈ 16 కథలలో ఎక్కడెక్కడ ఏమి వున్నది? అదికూడా వారు స్టేట్‌మెంట్ చేయవలసిందిగా కోరుతున్నాను.

శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు: ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితల సంఘం దాని ఉపాధ్యక్షుల్లో ఒకరైన కొడవటిగంటి కుటుంబరావుగారు సంపాదకత్వం వహించిన 'ఇప్పుడు వీస్తున్న గాలి' విప్లవ కథా సంకలనాన్ని ప్రచురించింది.... ఈ పుస్తకం శ్రీకాకుళం జిల్లాలో పోలీసులతో ఘర్షణలో చంపబడిన పంచాది నిర్మల, పంచాది కృష్ణమూర్తిలకు అంకితం చేయబడింది. ఇందులో వున్న విషయం— ఇండియాలో చట్టబద్ధంగా యేర్పడిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ద్వేషాన్ని, అసంతృప్తిని తెచ్చి అయిష్టతను ప్రేరేపించేదిగా వుందని భావించబడ్డది. సద్భావాన్ని కాపాడటానికి కూడా యిది భంగకరంగా ఉన్నది. ఈ ప్రచురణ ఇండియా పీనల్ కోడ్‌లోని 124 (A) 153 (A) 95 (A) సెక్షన్‌ల కింద శిక్షార్హమైనది.

శ్రీ వి కృష్ణమూర్తి నాయుడు: ఈ పుస్తకం గురించి నేను కామెంట్ చేయటానికి ఏమీలేదు. ఈ పుస్తకం కాపీ కూడా నా వద్ద వుంది.

శ్రీ యస్. రామకృష్ణయ్య: ఆ కాపీస్ మాకు కూడా అందచేస్తారా?

శ్రీ వి కృష్ణమూర్తి నాయుడు: ఇది బాన్‌చేసిన పుస్తకం దయచేసి ఆ పుస్తకం మీ దగ్గర పెట్టుకోకండి. ...... (నవ్వులు)

శ్రీ K. L. మహేంద్ర: మరి ఒక నిషిద్ధ పుస్తకాన్ని హోం మంత్రి యెట్లా చదువుతున్నారు? ఒకసారి అది నిషేధం చేయబడ్డ తర్వాత అది చదవటానికి అర్హత వుంటుందా?

శాసన మండలి అధ్యక్షుడు: మీరు కోరారు గనక ఆయన చదువుతున్నారు.

శ్రీ వి. కె. నాయుడు: మీరు అడిగారు గనక నేను చదువుతున్నాను.

ఇందులో 'చిరంజీవి' అని చెరబండరాజు వ్రాసినటువంటిది—

ఒకదగ్గర "పక్కనే డి. యస్. పి. రెడ్డి గబ్బిలాల్లాంటి మీసాల్తో ముక్కుపుటాల్ని పగలగొట్టే చుట్ట కంపుతో ఓ చెయ్యి పిస్తోలుమీదవేసి విగ్రహంలా కూర్చున్నాడు. దుమ్మును చీల్చుకొని చూస్తున్నాడు ముందుకు.

అతని పక్కనే కుర్రవాడు. పళ్ళాలుగేళ్ళుంటాయి. నిక్కరు, బుషర్టు వేసుకున్నాడు. చెరగని చిరునవ్వుతో సన్నటి పెదాలు ఏవో పాటల్ని నెమరేసుకుంటున్నాయి. అతని రెండోవేపు మిషిన్‌గన్‌తో మరో యినస్పెక్టరు".

మరోదగ్గర —

శ్రీ కె. కోటేశ్వరరావు: డి యస్. పి. రెడ్డి ఎట్లా వున్నాడో వర్ణించాడు అందులో తప్పేమిటి?

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: మొత్తం అన్నీ చదువుతాను సాంతం వినండి. "మూలమలుపులో 'అదిగో రాంబాబు' అంటూ ఒక్కసారిగ కేకలు వినిపించాయి. చెడుగుడు ఆడుకుంటున్న పిల్లలు చెల్లాచెదరైపోయారు. రాంబాబు నవ్వుతూ సంకెళ్ళ చేతులెత్తాడు. తర్వాత— ముందున్న యిద్దరు ఇన్స్‌పెక్టర్లు యింగ్లీషులో మాట్లాడుకొని రాంబాబును జీపు లోపలికి పంపించారు. "ఎందుకు సార్ అంత భయపడతారు" అంటూ రాంబాబు లోపలికెళ్ళాడు.

"కుర్రాడి చూపులు బాణాల్లా వున్నాయిరా"

"కళ్ళు నక్షత్రాల్లా అందంగా వున్నాయి"

"ఏమిటి ఆ కనుబొమలు అంత నల్లగా సిరా వొలికినట్టే వున్నాయి"

"పాపం మీసకట్టు యిప్పుడిప్పుడే వస్తోందిరా"

ఇది కాదు ... తర్వాత—

శ్రీ ఎ జోసెఫ్: ఆన్ ఎ పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్, ఇది పబ్లికేషన్‌కు ఎలవ్ చేయడానికి— ఈ పుస్తకం యిప్పటికే నిషేధించబడ్డది. ఇదంతా యిప్పుడు

పత్రికల్లో అచ్చువడం అనుమతించ వచ్చునా ? ఇప్పుడు మంత్రిగారు సభలో చెప్పిందంతా ?

శ్రీ కె. కోటేశ్వరరావు: ఎందుకు బాన్ చేశారో స్టేట్‌మెంటు పూర్తి చేయమనండి.

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: అధ్యక్షా, న్యాయంగా యిదంతా చదవకూడదు. ఇందులో యిటువంటి ఘట్టాలు చాలా వున్నాయి. ఇందులో ముఖ్యంగా వున్నదేమంటే— శ్రీకాకుళం నక్సలైట్స్‌గా వుండి, ఎన్నో హత్యలు చేసినవారికి యీ పుస్తకం అంకితం చేశారు. ఇందులో కొన్ని ఘట్టాలు, ఎట్లా వున్నాయంటే— ప్రభుత్వాన్ని దూషించడమే గాకుండా, ఉద్రేకాన్ని రేకెత్తించే విధంగా వున్నాయి. ఈ విషయమై సి. ఐ. డి. పోలీసు వారు తనిఖీచేసి....

శాసన మండలి అధ్యక్షుడు: మన అపోజిషన్ వారు దూషించేంతకంటే ఎక్కువ దూషించారా వారు ?

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: "ఒక్కోసారి చేతిలోని తుపాకితో కాల్చుకొని చావాలనిపించేది, బందిపోటు దొంగలా మారిపోవాలనిపించేది" అదొక వాక్యం. అడవిలో కొంతదూరం వెళ్ళి టక్కున జీపు ఆగిపోయింది. అందరూ తుపాకులతో సిద్ధంగా వున్నారు. 'పదండి, నడవాలి, ఆ కురక్రుంక జాగ్రత్త' డి. యస్. పి., యస్. ఐ. శివలింగం దిగారు. ఖాశిం కూడా తుపాకితో సిద్ధమయ్యాడు.

రాంబాబు వీపుమీద తుపాకి గురిపెట్టి వుంది. అయినా అతనికి వో యిసుమంతైనా భయం లేదు. "నేను దేశద్రోహిని? పద్నాలుగేళ్ళ పసివాడు దేశద్రోహి? నేను పీల్చే గాలి దేశద్రోహులకు సాయం చేసేది? నేను పుట్టిపెరిగిన భూమి నాదికాదు? నా పాటలు, నా కథలు, వేలాది లక్షలాది మంది విన్నారు, విన్నవాళ్ళు వినిపిస్తారు— నా గీతాల్లోని సాహిత్యాన్ని సత్యాన్ని ప్రచారం చేస్తారు. నన్ను మాయం చేయగలరు గాని నా గీతాన్ని ఏమి చేయగలరు? మీరు ప్రభుత్వ యంత్రాంగంలో కీలకమైన స్థానంలో వున్నారు. మాది ప్రజల పక్షం. మేం గెలిచేది లేనిది చరిత్ర తప్పకుండా రుజువు చేస్తుంది. కాని యిష్టంలేని, ఆత్మ అంగీకరించని, శత్రుపక్షంలో నిల్చొని ఏం సాధిస్తారు? ఏ వ్యవస్థను నిలబెట్ట దలచుకున్నారో అదే పరోక్షంగా మిమ్మల్ని ఖూనీ చేస్తుంది, ఆలోచించండి" మధ్య మధ్యలో ఆగుతూ, సాగుతూ రాంబాబు చెబుతున్న మాటల్లోని సారాంశాన్ని అందరూ మౌనంగా వింటున్నారు".

శ్రీ కె. కోటేశ్వరరావు: అధ్యక్షా, అందులో ఆక్షేపణీయమైనవి ఏమున్నాయి? వారు ఒక విధమైన సమాజాన్ని కావాలంటున్నారు. దానిని గురించి చెబుతున్నప్పుడు....

శ్రీ ఎ. జోసెఫ్: నక్సలైట్స్— ఎవరయితే హత్యలకు, దోపిడీలకు కారణ భూతులయ్యారో వారికి అంకితం చేసి వారిని ప్రోత్సహించే గ్రంథ మిది.

శ్రీ జి. బాపనయ్య: పంచాది కృష్ణమూర్తిగారి సంగతి నిర్మల సంగతి జోసఫ్ గారికి తెలియదండి. వారు వస్తూవుంటె పట్టుకొని కాల్చారండి.

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: నాకు బాగా తెలుసు.

శ్రీ జి. బాపనయ్య: మీకు తెలుసు. కాని వారికి తెలియదు. చదువుకున్న వారు, మేధావులు, తెలిసినవారు. వారిని పట్టుకొని— స్టేషన్‌లో పట్టుకొని, అక్రమంగా పట్టుకుని కాలిస్తే అటువంటి వారికి అంకితమిస్తే తప్పు ఏమిటి?

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు, అధ్యక్షా, శ్రీకాకుళం ప్రాంతంలో ఎన్ని హత్యలు జరిగాయో, ఎట్లా జరిగాయో మీకు తెలుసు, లోకానికి తెలుసు. వారు ఇళ్ల ల్లోకి వెళ్ళి, పడుకున్న మనుషులను తీసుకొచ్చి ఎంత ఘాతుకంగా వారిని చంపి వేసారో మనం చెప్పుకోలేము. అటువంటి పనులు చేసినటువంటి వారిని గురించి పెద్ద మహానుభావులుగా వీరు చెబుతున్నారంటే....

శ్రీ కె. కోటేశ్వరరావు: అది వేరే సంగతి. ఆ కథలలో ఏమిటి వుంది అంటున్నాను. ఈ కథలలో వున్న అబ్జెక్షనబుల్ మ్యాటర్ ఏమిటి చెప్పండి. ఒక ప్రక్కన కేంద్ర ప్రభుత్వం దానికి అవార్డు యిచ్చింది.

శాసనమండలి అధ్యక్షుడు: కేంద్ర ప్రభుత్వం చదివే యిచ్చిందా? లేక గెటప్‌కు యిచ్చిందా?

శ్రీ కె. కోటేశ్వరరావు: '70-71 ఔట్ స్టాండింగ్ బుక్స్‌లో దీనిని కేంద్ర ప్రభుత్వం వారు సెలెక్టు చేశారు.

శ్రీ జి. అచ్యుతరామరాజు: బహుమతి యివ్వడం కాదు. బుక్ ఫెయిర్‌లో ఏమేమి పుస్తకాలు పెట్టారో వాటన్నింటినీ గురించి ఔట్ స్టాండింగ్ అనే వున్నది యిందులో. ఔట్ స్టాండింగ్ నావెల్స్, ఔట్ స్టాండింగ్ స్టోరీస్.... అని.... ఇది ఆ బుక్స్ కేటలాగ్, బుక్ ఫెయిర్‌లోని కేటలాగ్, కేంద్ర ప్రభుత్వం బహుమతి యివ్వలేదు.

శ్రీ కె. కోటేశ్వరరావు: ఈ కథలు కొన్ని యిదివరకు 'ఆంధ్ర జ్యోతి' లాంటి పత్రికల్లో వచ్చినవి. దీనికి ఎందుకు అబ్జెక్షన్ ఉండాలి?

శ్రీ ఎ. జోసెఫ్: అధ్యక్షా, మాకుకూడా మాట్లాడటానికి అవకాశం యివ్వాలి. మినిస్టర్‌గారు చదివిన భాగాలలో తుపాకి....

శాసనమండలి అధ్యక్షుడు: కాలెటన్ షన్ మోషన్ ఎవరు యిస్తారో వారికే అవకాశం యివ్వడం జరుగుతుంది. మంత్రిగారు సమాధానం చెబుతారు. మధ్య మనం కాంప్లికేట్ చేయడమెందుకు ?

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: సర్, ఇంకా చెప్పడానికేమీ లేదు.

దీంట్లో ఎన్‌కౌంటర్‌లో చచ్చిపోయిన పిల్లవాడిని చంపిన వాళ్ళకు ఎదురు తిరిగి మీరు తప్పు పని చేశారు. మీరు యీ పిల్లవాడిని చంపారు అని తిరిగి పోలీసువారిలోనే ఒకాయన ఎదురు తిరిగి డి. యస్. పి. ని చంపాడు- అవి. యిటువంటి వన్నీ ప్రొవోకేట్ చేసే విషయాలు కూడా వున్నాయి యిందులో. అదేగాకుండా- యిది, "సద్భావాన్ని కాపాడటానికి భంగకరంగా ఉన్నది" అని డి. ఐ. జి., సి. ఐ. డి. రిపోర్టిచ్చారు. మేము శక్షన్ 153, 295 ల ప్రకారం చర్య తీసుకోవాల్సి వచ్చింది. ఇది శిక్షార్హమైనది. అందుకే ఆ పుస్తకాన్ని మేం నిషేధించాము.

శ్రీ కోటేశ్వరరావు: పుస్తకాలపై డి. ఐ. జి., సి. ఐ. డి. రిపోర్టు ఏమిటి? లిటరరీ పీపుల్‌ను ఇద్దరినో, ముగ్గురినో కమిటీగా వేసి వారిని అడగండి. వారిని చెప్పమనండి వారి అభిప్రాయాలు. డి.ఐ.జి. రిపోర్టు పై మీరు పుస్తకాలు బాన్‌చేస్తే ఎట్లా ?

శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు: వారు పంపిన రిపోర్టును మేము ఎగ్జామిన్ చేసి, మేము కన్‌విన్స్ అయ్యే చేశాము. కమిటీ వెయ్యవలసిన అవసరం లేదు. మేము కన్‌విన్స్ అయ్యాము. 'ఇది సద్భావాన్ని కాపాడటానికి భంగకరంగా ఉంది.' అందువల్ల బాన్ చేశాము.

"మరణం ప్రతి ఒక్కరికీ సర్వసాధారణమైన విషయం; ప్రజల ప్రయోజనాల కొరకు మరణించటం థాయ్ శిఖరం కన్నా బరువైనది. అలాగా ఫాసిస్టుల కొరకు, ప్రజలను దోపిడీ చేస్తూ పీడించేవారికొరకు పనిచేయటమూ, మరణించటమూ ఈక కన్నా తేలికైనది"

— మావో

పరిచయం :

## విప్లవ శంఖారావం

ప్రజా కవిత్వం అంటే ఏమిటి? ప్రజా సాహిత్యం ఎలా వుండాలి అని 2, 3 సం॥ లుగా విప్లవ సాహితీపరుల్లో చర్చలు జరుగుతున్నయ్. విరసం ఆవిర్భావం నుంచీ చాలా విప్లవ కవితలు వెలువడినై. చర్చలు చర్చలుగా వుండగానే "ఇదిగో ప్రజా కవిత్వం అంటే యిదీ" అని నిరూపించుకుంటూ 'శంఖారావం' వినొచ్చింది. పైన కవరు బొమ్మ చూడగానే తెలుస్తుంది ప్రజా కళ అంటే ఏమిటో. విప్లవ కళా కారులం చిత్రకారులం అనుకొనేవారు వినయంతో తమ అవగాహనా లోపాన్ని సవ రించుకోమని చెబుతుంది గిరిజనుని శంఖారావ చిత్రం.

ఉద్యమంలో వుండి, విప్లవ కార్యాచరణలో వుండి త్యాగాలకు కష్టాలకు లోన వుతూ రాటుతేలిన వారి రచనలు యివి అని తెలుస్తూనే వుంటుంది. ఆచరణతో సమ న్వితులయినా ఆలోచనాపరుల సాహిత్యం గనకనే యింత మంచిగా ప్రజా కవితలుగా రూపొందినయ్ శంఖారావం గేయాలు.

నిన్నమొన్నటి వరకూ సాగుతూ వచ్చిన వచన కవి'తోద్యమ' చర్చలు ఎంత నిస్సారమైనవో యీ సంకలనం ఋజువు చేసింది. రూపం ప్రధానం కాదు; ఆచరణ అంటే విషయం, చెప్పేవారి సిన్సియారిటీ ప్రధానం, చదువులకు అందుబాటులో వుండటం ముఖ్యం అని ఋజువు చేసింది.

చాలా పురాతన ఛందోశైలి అయిన సీస పద్యాలు రాశినా ఎంత బాగా రాశారు! ప్రజల కర్థమయేట్టు ఉత్సాహం కల్గేట్టు వున్నయ్.

చెప్పదలచుకున్న విషయాన్ని విశితంగా వెంటనే అవగాహన అయేట్టు చెప్పగల్గారు.

విప్లవ పోరాటంలో అమరులయిన వీరులందరనూ ప్రజలకు పరిచయం చేశారు.

మార్చ్, ఝంఝులు ఆధునిక తెలుగు విప్లవ సాహిత్యంలో తొలి ప్రయ త్నాలైతే శంఖారావం యీ కాలపు విప్లవ ప్రజా సాహిత్యంలో శంఖారావమే.

[శంఖారావం — ప్రపంచ కార్మికులారా ఏకం కండి అని పిలుపు యిస్తున్న విప్లవ శంఖారావం— విప్లవ గేయాల సంకలనం.

ప్రతులకు: పబ్లిషర్స్, సోషలిస్టు పబ్లికేషన్స్, పెనుమాక (పోస్టు) గుంటూరు జిల్లా. వెల: 1-50 పైసలు.]

సమీక్షలు:

# విప్లవ శాస్త్రం

1. చీనా విప్లవం గురించి స్టాలిన్ (ఇంగ్లీషు)
2. చీనా విప్లవం గురించి మావో సె-టుంగ్ (ఇంగ్లీషు)

రచయిత: చెన్ పో-టా; న్యూ బుక్ సెంటర్, కలకత్తా.

ఈనాడు చీనాలో కమ్యూనిస్టు పరిపాలన ఉన్నదన్న విషయం నిక్సన్ కూడా గుర్తించి, చీనా యాత్రచేసి, పూర్వం హంతకులుగానూ, బందిపోట్లుగానూ పేర్కొన బడిన వాళ్లతో సంప్రదింపులు జరిపి. ఫొటోలూ అవీ తీయించుకున్నాడు గనక, శ్రీమాన్ రాజగోపాలాచారిగారు సైతం చీనాలో అనివార్యంగా విప్లవం జరిగిందనీ, అది "హూష్, కాకీ!" అంటే పొయ్యేది కాదనీ అంగీకరించక తప్పదు.

మన దేశంలో విప్లవంలేదని లోకానికి తెలయగలందులకు మన పోలీసు శాఖ వారు మావో సాహిత్యాన్ని జప్తుచేసుకుపోతున్నా అది టన్నులకొద్దీ విదేశాలలో తయారై ఇండియాకు దిగుమతి అయి అమ్ముతున్నది. పెలికాన్ పుస్తకాలూ, ఆక్స్‌ఫర్డ్ యూని వర్సిటీ ప్రెస్ వారివీ, ఇతరులవీ చీనా - మావో పుస్తకాలు అసంఖ్యాకంగా విడుదల అవుతున్నాయి. ఇప్పుడు సమీక్షించే ఈ రెండు పుస్తకాలూ మన దేశంలో తయా రైనవి. వీటిలో ఉన్నది చీనా విప్లవ చరిత్ర కాదు, విప్లవ శాస్త్ర చర్చలు.

"విప్లవ శాస్త్రం అంటూ ఉన్నదా? ఉన్నది," అన్నాడు స్టాలిన్. అదే మార్క్సి జం - లెనినిజం. విప్లవకారులు అరాజకీయవాదులనీ, వాళ్లు తమ సహజ దౌష్ట్యంతో ప్రజలను మభ్యపెట్టి, వాళ్లను హింసాచర్యలకు పురికొల్పి "ధర్మం"గా ఏర్పడిన ప్రభు త్వాలను కూలదోసి, "ధర్మ" హీనమైన వ్యవస్థ నెలకొల్ప యత్నిస్తారనీ, అందుచేత వారిని నిర్మూలించటంలో ఏ ధర్మాన్నీ పాటించనవసరం లేదనీ ఒక నాయనమ్మ సిద్ధాం తాన్ని ఎనాడో తయారుచేశారు. రష్యా విప్లవం జరిగింది, అక్కడ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి, ఆ వ్యవస్థ కింద దేశం ఆర్థికంగానూ, సాంఘికంగానూ, మిలిటరీగానూ ఊహించరాని అభివృద్ధి సాధించటమే గాక, కిందటి యుద్ధంలో ఫాసిజం నడుము విరగగొట్టిన మీదట ఈ నాయనమ్మ సిద్ధాంతానికి కాలదోషం పట్టింది. దాని ఫలితంగా జరిగిన దేమంటే విప్లవం అనే మాటకు న్యూనత తగ్గి కొంత గౌరవం — దూరపు కొండలు నునుపులాటిది — లభించింది. సోవియట్ విప్లవకారులు హంతకులూ,

దుండగులూ, బందిపోట్లూ కావటం మానేసి మహావీరుల జాబితాలోకి చేరారు. మన పరిపాలకులకు ప్రోలిటేరియన్ రివల్యూషన్ అంటే హడలే అయినా లెనిన్ మహాశయుణ్ణి ప్రజల డబ్బుతో ఆరాధించబూనుకున్నారు.

చెప్పవచ్చిందేమంటే. ఇలాటి ఆరాధనల వెనక శాస్త్రీయ విప్లవ దృక్పథాలేమీ ఉండవు. నిజంగా విప్లవాలు చేసేవాళ్లు అలా చేలకు అడ్డం పడిపోలేరు. వాళ్ల ప్రతి ఎత్తుగడా నిర్దుష్టంగా ఉండాలి. ఎక్కడ ఏ రవంత పొరపాటు జరిగినా తీరని నష్టం కలుగుతుంగి. ఈ బాధలు వర్గ నియంతృత్వాలకు లేవు. రాజరికానికి పునాది "రాజు తప్పు చేయడు" అన్న నినాదం. బూర్జువా వర్గ నియంతృత్వానికి అనేక నాలుకలు. అదొక పెద్ద ఆర్కెస్ట్రా. ఆ వర్గం యొక్క అభ్యుదయానికి అనుకూలించేది ఏదైనా చెయ్యవచ్చు. వీలైతే ప్రజలను మభ్యపెట్టటం, వీలు కాకపోతే తుపాకులతో నోళ్లు మూయటం, మరీ తప్పనిసరిగావస్తే దొడ్డిదారిన ఫాసిజం ప్రవేశ పెట్టటం. అత్యధిక ప్రజల కష్టసుఖాల ప్రమేయం ఏమీ లేదు. ఆ అత్యధిక సంఖ్యాక ప్రజలపైన ఆధారపడి, తన విజయాన్ని వారి అభ్యుదయంతో అంచనా కట్టేది శ్రామిక విప్లవం. అది కత్తిమీది సాము అమిత నిర్దుష్టంగా కొనసాగవలసినది. అందులోని ఎత్తుగడలు మేధోవంతమైనవి. పొరపాట్లకు అవకాశాలు హెచ్చు. ఒక వంక మితవాదాన్నీ, మరొకవంక అతివాదాన్నీ సరిచేసుకుంటూ, అడుగడుగునా ఆత్మ విమర్శ చేసుకుంటూ విప్లవం కొనసాగాలి. దాని సిద్ధాంతాలు సార్వత్రికమైన మార్క్సిజం - లెనినిజంకు సంబంధించినవి; ఆచరణ మాత్రం ప్రాదేశిక, సమకాలిక పరిస్థితులకు అనుగుణంగా మలచుకోవలసినది. అడుగడుగునా ఏర్పడే వైరుధ్యాలను సమన్వయించాలి; శత్రు కూటమిలోని వైరుధ్యాలను ఉపయోగించుకోవాలి.

ఏ విప్లవమూ ఆకాశంనుంచి ఊడిపడదు, గాలిలో జరగదు. ప్రతి విప్లవానికి పూర్వం చరిత్ర, క్షేత్రమూ, బీజాలూ ఉంటాయి. రష్యా విప్లవాన్ని ఎప్పటినుంచి లెక్కగట్టుతారో నాకు స్పష్టంగా తెలీదు. కనీసం 1905 నుంచి రష్యాలో విప్లవం రాజుతూనే ఉన్నది. కాని 1949లో మావో చీనావిప్లవం వయసు 109 ఏళ్ళని అంచనా కట్టాడు. అంటే 1840 లో నల్లమందు యుద్ధాలు చీనాలో ఆరంభమయాయి. ("బందిపోట్లు దబ్బిస్తావా, ప్రాణం ఇస్తావా అంటారు. మనం— అంటే బ్రిటిషువాళ్లం— మీ డబ్బూ, ప్రాణాలూ ఇయ్యండి అన్నాం!" రస్కిన్.)

అది మొదలు వారు(చీనా ప్రజలు) "పోరాడారు, అపజయం పొందారు, మళ్లీ పోరాడారు, మళ్ళీ అపజయం పొందారు. మళ్ళీ పోరాడారు, 109 ఏళ్ళ అనుభవం గడించారు. అనేకవందల చిన్న పెద్ద, పోరాటాల అనుభూతి పొందారు— రాజకీయం

గానూ, యుద్ధతంత్రంలోనూ, ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ, రక్తపాతంతోనూ రక్తపాతం లేకుండానూ— అప్పుడే ఈనాటి ప్రాథమికవిజయం సాధ్యమయింది"-మావో.

చీనా విప్లవవిజయం ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిది కాకపోయినా మిగిలిన వాటికన్న అనేకవిధాల విలక్షణమైనది. 1926 డిసెంబరులోనే స్టాలిన్ చీనా విప్లవం తాలూకు విశిష్టలక్షణాలను వివరిస్తూ, రష్యాలాగా కాక చీనా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ద్వారా విప్లవాన్ని సాధించవలసి ఉంటుందని చెప్పాడు. సామ్రాజ్యవాదం ఉద్ధుకుడుచుకుంటున్న తరుణంలో రష్యా విప్లవం జరిగింది. ఫాసిజమును ఎదుర్కొన టానికి అమెరికా, బ్రిటనులు రష్యాతో చేతులుకలిపిన ఫలితంగా తూర్పుయూరపు దేశా లలో సోషలిస్టు వ్యవస్థలు ఏర్పడ్డాయి. చీనా విప్లవం ఎలాటి బాహిరసహాయమూ లేకుండానే కొనసాగి చివరకు నెగ్గింది. నిజానికి చీనాలో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడినది మొదలు కామింటర్న్ ఆ పార్టీ అనుసరించవలసిన పంథానుగురించి 1927 దాకా అంటే కమ్యూనిస్టులు కొమింటాంగ్‌తో తెగతెంపులుచేసుకున్నదాకా- సలహాలుఇస్తూనేవచ్చింది.

చీనా విప్లవాన్ని కామింటర్న్ తప్పుదారి పట్టించిందన్న అపవాదు వచ్చింది, అందుచేత చీనా విప్లవం విజయం పూర్తిగా చీనా విప్లవకారులదీ, వారిని నిర్దుష్టమార్గాన నడిపించిన మావోదీనూ. చీనా విప్లవం 1949లో ఆగిపోలేదని మనకిప్పుడు తెలుసు, మానవ చరిత్రలోనే అపూర్వమనదగిన ప్రోలిటేరియన్ సాంస్కృతిక విప్లవం మావో నాయకత్వంతోనే జరిగింది. (పార్టీనీ, పరిపాలన యంత్రాంగాన్నీ కూలనచెయ్యటానికి మావో ప్రజలను తిరగబడమన్నాడు!) ఇంకా ఇలాటి సాంస్కృతిక విప్లవాలు జరగా లని మావో అభిప్రాయం.

చీనా విప్లవంలో మరొక విశిష్టతఏమంటే, అది మిగిలిన విప్లవాలకంటె సమగ్ర మైనదీ, లోతైనదీనూ. రష్యామొదలైన సోషలిస్టువ్యవస్థలలోలాగా విప్లవం నీరుకారి పోకుండానూ, రివిజనిజం తలయెత్తకుండానూ చీనా విప్లవపార్టీ చాలా జాగ్రత్తలు తీసు కున్నది, తీసుకుంటున్నది.

టాయ్‌కింగ్ తిరుగుబాటునుంచి ప్రోలిటేరియన్ సాంస్కృతి విప్లవందాకా నడ చిన విప్లవదశలను గురించీ, వాటి నాయకత్వమూ, ధోరణీ మొదలైనవాటిని గురించీ చదువుకోవచ్చు. ఈ రెండు పుస్తకాలూ అందుకోసం ఉద్దేశించినవికావు సినిమాలలో చూసే యుద్ధాలలాగే, పుస్తకాలలో చదివే విప్లవచరిత్రలుకూడా మనని "ఆనందపరచ" వచ్చుగాని, నిజంగా మనకు అంటవు రామాయణంలో రామరావణయుద్ధమూ, భారతం లో కౌరవపాండవ యుద్ధమూలేవా?

ఈ రెండు పుస్తకాలూ విప్లవశాస్త్రం ఎలా ఉంటుందో విశ్లేషించి చెబుతాయి. 1926 డిసెంబరు 10 నుంచి 1927 అక్టోబరు 14 దాకా స్టాలిన్ చీనా విప్లవ పరిస్థితిని మార్క్సిస్టు—లెనినిస్టు దృక్పథంతో విశ్లేషించాడు. ఈ ప్రసంగాలు విప్లవశాస్త్రజ్ఞానం సంపాదించగోరేవారికి చక్కనిపాఠాలు. చీనావిప్లవ విజయానికి ఇవి ఏమీ సహకరించ లేదని అనుకున్నాకూడా వీటి విలువ గొప్పది.

రెండవపుస్తకం చీనావిప్లవంలో మావోదృక్పథం నిర్వహించినపాత్ర ఎలాటిదో స్పష్టంచేస్తుంది. చీనా విప్లవానికి మావో చేసిన మహత్తర సేవ ఏమంటే, "ఆయన మార్క్సిజం-లెనినిజంయొక్క సార్వత్రిక సత్యాన్ని చీనా విప్లవ ప్రత్యక్ష ఆచరణతో సమన్వయించి, విప్లవపంథాలో యేర్పడిన అసంఖ్యాక సమస్యలను నిర్దుష్టంగానూ, అద్భుతంగానూ పరిష్కరించాడు." 30 ఏళ్ళపాటు మావో తనపార్టీలోపలా వెలపలా ఉన్న ప్రతీఘాతుకులనూ, అవకాశవాదులనూ నిర్ద్వంద్వంగా ఎదుర్కొని పోరాడాడు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్‌ల విప్లవసిద్ధాంతాన్ని ప్రచారంచెయ్యటంలోనూ అమలు జరపటంలోనూ అత్యంత సమర్థుడని రుజువుచేసుకున్నాడు.

సిద్ధాంతానికీ ఆచరణకూ అవినాభావసంబంధం ఉండటం మార్క్సిజం-లెనినిజం ప్రత్యేకలక్షణం. మార్క్సిస్టు యొక్క మౌలిక కర్తవ్యం వర్గవిశ్లేషణా ధానాన్నివివిని యోగించటం. ఇందులో మావో నిపుణుడు.

దాదాపు నూరేళ్ళపాటు చీనా అర్ధవలసదేశంగా ఉండింది. ప్రాచ్యంలో అది అనేక వైరుధ్యాలకు కేంద్రంగా ఉండేది. ఇంపీరియలిస్టు దేశాలన్నీ చీనామీద రాబందు ల్లాగా పడి పీక్కుతిన్నాయి. దాన్ని ఆ దేశాలు తమ సరుకుల ఎగుమతికీ, పెట్టుబడి ఎగుమతికీ దివ్యమైన క్షేత్రంగా వాడుకున్నారు. చీనావిప్లవాన్ని అణచటానికి ఆదేశా లన్నీ ఏకమయ్యాయి. ఇతర సమయాలలో చీనాను తమలోతాము పంచుకోవటానికి కృషి చేశాయి. ఈ ప్రక్రియ వారిమధ్య వైరుధ్యాలకు దారితీసి, సామ్రాజ్యవాదులను దుర్బలం చేస్తుందన్న సంగతి మావో గమనించాడు. ఇంతేగాక, సామ్రాజ్యవాదుల కీచులాటలతోబాటు చీనాపాలకులమధ్య కీచులాటలుకూడా పెరిగి సేనాపతుల(warlords) మధ్య అంతులేని యుద్ధాలు సాగాయి. 1912 మొదలుకొని ఈయుద్ధాలకు బయటినుంచి సామ్రాజ్యవాదులూ, లోపలినుంచి దళారీ భూస్వామివర్గాల వాళ్లూ మద్దతు యిచ్చారు.

ఒకవంక సామ్రాజ్యవాదులపీడనా, మరొకవంక ఫ్యూడలిస్టుపీడనా భరించలేని ప్రజలు 1840 మొదలుకొని ఎడతెగని ప్రతిఘటనలు సాగించారు. ఈ ప్రతిఘటనలలో అసంఖ్యాకప్రజలు క్రియంగా పాల్గొన్నారు. అతిదీర్ఘకాల విప్లవం కొనసాగింది. దీని

ఫలితంగా ప్రజలు క్రమంగా అమిత బలవత్తరమైన సుసంఘటితశక్తిగా రూపొందారు. దేశం మొదట సామ్రాజ్యవాదులమధ్య సంఘర్షణకూ, తరవాత విప్లవ, తద్వ్యతిరేక సంఘర్షణకూ కేంద్రమయింది. "ఈ వైరుధ్యాలను పరిష్కరించటానికి ప్రజావిప్లవం తప్ప మార్గంలేదనీ, ప్రాచ్యంలో సామ్రాజ్యవాదులు పన్నిన ఉచ్చులు చీనాలోనే మొదటగా తెగాలనీ స్పష్టమయింది."

ఈపని సాధించేశక్తి చీనాప్రజలకున్నది. కాని వారికి విజయం లభించాలంటే ప్రోలేటేరియట్ నాయకత్వం వహించాలి చీనాలో శ్రామికవర్గం విస్తృతం కానప్పటికీ కేంద్రీకృతమై ఉండేది. ఆ వర్గాన్ని మూడు క్రూరశక్తులు– విదేశీ సామ్రాజ్యవాదం, స్వదేశీ ఫ్యూడలిజం, పెట్టుబడిదారీ– మహా తీవ్రంగా పీడించాయి. కార్మికుల సంఖ్య జనాభాలో అల్పభాగమేఅయినా అర్ధప్రోలిటేరియనులైన పేదరైతులతో కలిసినప్పుడు వారి సంఖ్య జనాభాలో సగానికిమించింది. ఈ కారణంచేత చీనాలో శ్రామికవర్గం తన పార్టీని(కమ్యూనిస్టుపార్టీని) ఏర్పరచుకుని విప్లవవర్గాలన్నిటికీ నాయకత్వం వహించగలిగింది. దీనికి కాలంకూడా కలిసివచ్చింది. ఎందుచేతనంటే రష్యావిప్లవం అనంతరం విప్లవయుగం ఆరంభమయింది. చీనాకు అంతర్జాతీయ సహకారంకూడా లభించింది. చీనా విప్లవం వలసవ్యతిరేక స్వభావాన్ని తప్పక పొంది, ప్రపంచవ్యాప్తమైన వలసవిధానపు పునాదులనే బద్దలు చేస్తుందని 1927 నాడే స్టాలిన్ అన్నాడు. అదే జరిగింది.

కాని అది తేలికగాగాని సులభంగాగాని జరగలేదు. దానిమార్గం దారుణంగానూ క్లిష్టంగానూ, అనేక చుట్టు తిరుగుళ్ళతోనూ కూడుకున్నది. ఆ కారణంచేతనే చీనా శ్రామికులూ, ప్రజలూ కమ్యూనిస్టుపార్టీ బాగా రాటుతేలటం సాధ్యమయింది. ఈ విప్లవానుభవాలసారమే "మావోథాట్" (మావో తత్వం లేక మావో విధానం)

ప్రపంచ ప్రోలిటేరియనతోనూ, ప్రాచ్యదేశాలలో దోపిడీకి గురిఅయే శ్రమజీవులతోనూ ఎలాటి సంబంధాలు సృష్టించుకోవాలన్న సమస్యలకు పరిష్కారం కావాలనీ, ఆ పరిష్కారం ఏ కమ్యూనిస్టు పుస్తకంలోనూ దొరకదనీ లెనిన్ అన్నాడు. ఈ సమస్య యొక్క మూలసూత్రాలను లెనిన్ స్టాలిన్లు ప్రతిపాదించారు. మావో వారికృషిని మరింతముందుకు తీసుకుపోయి, చీనా విప్లవకార్యాచరణకు అన్వయించాడు, ఆయన కమ్యూనిస్టుసిద్ధాంతాన్ని చీనాప్రజల భాషలోకి అనువదించి, అనేక కోట్ల ప్రజలను ఉత్తేజపరిచాడు.

చీనావిప్లవాన్ని మావో ప్రాదేశిక సమస్యగా చూడలేదు. అది ప్రపంచవ్యాప్త వలసవిధాన వ్యతిరేకోద్యమం: ప్రపంచప్రోలిటేరియన్ విప్లవంలో ఒక భాగం. పీడిత ప్రజలంతా ఒక పక్షం, విప్లవ వ్యతిరేకులంతా ఒక పక్షం. మధ్యంతరవర్గాలు విచ్ఛి

పోతాయి. వాటికి స్వతంత్రిప్రతిపత్తిలేదు అని 1926లో మావో అన్నాడు. ఆ సమయంలో చ్యాంగ్‌కైషేక్ విప్లవోద్యమానికి స్వస్తిచెప్పే ఎత్తుగడలో ఉన్నాడు: కొమింటాంగ్‌లో ఒకవర్గం రష్యాతోగాని. సామ్రాజ్యవాదులతోగాని కలవకుండా మధ్యేమార్గంగా ఉండే ఆలోచన చేస్తున్నది.

1937-45 మధ్య జపానును ప్రతిఘటించి యుద్ధంచెయ్యటానికి అన్నివర్గాలూ ఏకమయాయి. కమ్యూనిస్టులుకూడా ఆ సమాఖ్యలో ఉన్నారు. ఆ సమయంలో కమ్యూనిస్టు పార్టీలో మితవాది అవకాశవాదం తలఎత్తింది. కొందరు శ్రామికవర్గాన్ని బడా బూర్జువావర్గానికి తోకగా రూపొందించాలని వాదించారు. వారి వాదనలను మావో తీవ్రింగా ఖండిస్తూ, రష్యాలో విప్లవం జరిగి, అంతర్జాతీయ బూర్జువా-పెట్టుబడిదారీ వర్గానికి పెద్దదెబ్బతగిలిన దశలో పాతకాలపు బూర్జువా డెమొకాృటిక్ ప్రపంచవిప్లవానికి కాలదోషంపట్టిందనీ, రావలసినది ప్రపంచప్రోలిటేరియన్ విప్లవమేననీ మావో స్పష్టం చేశాడు. వలస, అర్థవలసదేశాలలో జరిగే విప్లవాలకిది కీలకమైన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రిం.

చీనాలో జరగవలసిన విప్లవం ప్రిపంచ ప్రోలిటేరియన్ విప్లవంలో అంతర్భాగమనటానికి మావో కారణాలు వివరించాడు.

"1. ఈ విప్లవం సామ్రాజ్యవాదంమీద దెబ్బదీసి, సామ్రాజ్యవాదుల ప్రతిఘటనను ఎదుర్కొంటుంది. సోషలిస్టుదేశం(రష్యా)సహాయమూ, అంతర్జాతీయ ప్రొలిటేరియట్ సహాయములేకుండా చీనా విముక్తిపొందలేదు. 2. సోవియట్ యూనియనుకూ సామ్రాజ్యవాదులకూ మధ్య ఘర్షణ తీవ్రిమవుతూఉంటే చీనా ఏదో ఒక పక్షం చేరాలి. ఏ పక్షమూ చేరమన్నది భ్రిమ. 3. ఇంపీరియలిజముమీదా, ఫ్యూడలిజముమీదా విజయం సాధించినాక చీనాలో బూర్జువానియంతృత్వంకింద పెట్టుబడివ్యవస్థ నిర్మించుకోవాలనటం విడ్డూరంకాదా? కమ్యూనిజం దారిచూపకుండా చీనాలో డెమొక్రాటిక్ విప్లవమే నెగ్గలేదు, తదనంతరం విప్లవదశమాట అటుంచండి. ప్రిపంచమంతా ఈనాడు తన విమోచనం కోసం కమ్యూనిజంమీదనే ఆధారపడివుంది, ఈ విషయంలో చీనాకు అపవాదు ఏమీలేదు."

డెమొకాృటిక్ విప్లవం మొదటి దశ అనీ, ప్రొలిటేరియన్ విప్లవం రెండవ దశ అనీ మావో చెప్పాడు. మొదటి దశకు బూర్జువా వర్గం నాయకత్వం వహించలేదని స్పష్టమయాక మావో దాన్ని ప్రిజల డెమొకాృటిక్ విప్లవం అన్నాడు. రెండు దశలకూ ప్రొలిటేరియన్ నాయకత్వం అవసరమయింది. ఆ నాయకత్వం కింద ప్రిజాబాహుళ్యం సామ్రాజ్యవాదాల్నీ, ఫ్యూడలిజమునూ, బ్యూరోక్రాటిక్ పెట్టుబడిదారీని

ప్రతిఘటించాలి. ఇందులో ప్రజా బాహుళ్యం అనే వారు మావో దృష్టిలో ప్రధానంగా రైతులు. కార్మికులూ, రైతులూ, మేధావులూ తదితర పెటీబూర్జువా వర్గాలూ ప్రొలిటేరియన్ నాయకత్వం కింద చీనా భవిష్యత్తు నిర్ణయించాలి.

విప్లవం యొక్క విజయం ప్రోలిటేరియన్ నాయకత్వంపైనే ఆధారపడి ఉన్నది. చీనాలోని పెటీబూర్జువా, జాతీయ బూర్జువా వర్గాలు నడిపిన విప్లవాలు ఫలించలేదు. అయితే ప్రొలిటేరియన్ నాయకత్వానికి గుండెకాయ రైతు సమస్య. ("సంగ్రహంగా చెప్పాలంటే, జాతీయ సమస్య రైతు సమస్యే"— స్టాలిన్.) ఈ విషయంలో లెనిన్, స్టాలిన్‌లు చెప్పిన దానిమీదనే మావో మరింత చెప్పాడు.

"రైతు విప్లవంలో నాయకత్వం వహించటమే ప్రొలిటేరియన్ నాయకత్వానికి అర్థాచిహ్నం. బూర్జువా డెమోక్రాటిక్ విప్లవానికి బూర్జువా వర్గం నాయకత్వం వహించలేకపోవటానికి ముఖ్యకారణం ఆ వర్గం రైతు విప్లవానికి నాయకత్వం వహించలేకపోవడమూ, అలాటి విప్లవమంటే భయపడి ప్రతిఘటించటమూనూ."

శ్రామిక కర్షకుల సమ్మేళనమే కొత్త డెమోక్రాటిక్ విప్లవాన్ని పోషలిస్టు విప్లవంగా పరిణమింప జేయటానికి దోహదం చేసిందని మావో అన్నాడు.

1927 అనంతరం చీనా కమ్యూనిస్టులు నగరాలను వదిలేసి పల్లెపట్టులను కైవసం చేసుకో నారంభించారు. పల్లెపట్టులలో తమ బలాన్ని పెంచుకొని, ఆ బలంతోనే నగరాలను చుట్టుముట్టారు, వశపరుచుకున్నారు.

ఇది మావో నిర్దేశించిన విధానం. ఇదే సరిఅయిన విధానమన్నది ఆచరణలో రుజువయింది.

మావోకు శత్రువు బలమూ, క్రౌర్యమూ బాగా తెలుసును. అందుచేత చీనా విప్లవం దీర్ఘకాల పోరాటానికి సిద్ధంగా ఉండాలనీ, విప్లవ శక్తులు వ్యవధి మీద బలాన్ని కూడగట్టుకుని, శత్రువును నిర్మూలించే విధంగా రాటుతేలాలనీ హెచ్చరిస్తూ, క్షణకాలంలో విప్లవం అయత్తమవుతుందన్నది పొరపాటని చెప్పాడు. అది సాయుధ విప్లవమే తప్ప, శాంతియుత విప్లవం కాజాలదు. శాంతియుత చర్యలు వేటికీ శత్రువు ఆస్కారం ఇవ్వటం లేదు. "చీనాలో సాయుధ విప్లవ శక్తులకూ, సాయుధ విప్లవ వ్యతిరేక శక్తులకూ పోరాటం జరుగుతున్నది, చీనా విప్లవానికి ఇదొక ప్రత్యేకతా, సదవకాశమూనూ" అన్నాడు మావో.

చీనా విప్లవానికి స్థావరాలు కావాలి. ముఖ్యపట్టణాలన్నీ శత్రువుల అధీనంలో ఉన్నాయి. శత్రువుతో ముఖాముఖి యుద్ధాలు తలపెట్టకుండా బలం పుంజుకోవాలంటే మారుమూల పల్లెపట్టులలో స్థావరాలు ఏర్పరచుకోవాలి. ఆ స్థావరాలను సైనికంగానూ

రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ బలమైన విప్లవదుర్గాలుగా రూపొందించుకోవాలి తరవాత సుదీర్ఘపోరాటంద్వారా సమగ్ర విప్లవవిజయంసాధించాలి ఎంతచిన్నవైనా స్థావరాలు ఏర్పడటం ముఖ్యమని మావో గట్టిగాచెప్పాడు. ఎర్రసేనను సృష్టించుకొనటానికీ, విప్లవ వేగాన్ని పెంపొందించటానికీ అంతకన్న మార్గంలేదని మావో స్పష్టం చేశాడు. చీనా విస్తృతమైన దేశం. కదలటానికి కావలసినంత చోటు! శతృవుకు బలం తక్కువగాఉండేవి పల్లెపట్లు, ఆ దౌర్బల్యాన్ని ఆసరాచేసుకుని తొలి విజయాలు అక్కడే సాధించినట్టయితే దీర్ఘకాల విప్లవపోరాటానికి అవి స్థావరాలుగా పనికివస్తాయి.

చింగ్‌కాంగ్ షాన్ (చింగ్‌కాంగ్ పర్వతాలు)లో మొదటి స్థావరం ఏర్పడింది. ఆటుతరవాత ఇంకా అనేక స్థావరాలు ఏర్పడ్డాయి. అయినా మావో అనేక తప్పుడు వాదనలను ఎదుర్కోక తప్పలేదు కొందరు కామ్రేడ్స్ చాలాకాలంపాటు స్థావరాలను అంటిపెట్టుకుని ఉండటంగురించి అసంతృప్తిచెంది, సత్వరవిజయాలు సాధ్యమని సిద్ధాం తీకరించారు. చీనారాజకీయ ఆర్థిక పరిణితిలో ఎన్నో ఎగుడుదిగుడులున్నట్టు వీరుఅంగీక రించలేదు. మావో సరిఅయిన ఆలోచననే చెప్పినప్పటికి అతివాది దుందుడుకువాదం మూడుసార్లు తాత్కాలికంగా నెగ్గి, విప్లవానికి తీరనినష్టాన్ని కలిగించింది. పట్టణాలను పట్టుకోవాలని తీవ్రవాదులు పట్టుబట్టారు.

గెరిల్లా యుద్ధతంత్రానికిగూడా మావో అత్యంతప్రాధాన్యం ఇచ్చాడు. ("చిన్న చిన్న విజయాలను పోగుచేసుకుని ఘనవిజయాలకు మార్గంవేసుకో") తీవ్రవాదులు గెరిల్లా పోరాటాలవిలువ గ్రహించక, ముఖాముఖి పోరాటాలకోసం— అదికూడా తమకన్న బలవత్తరమైన శతృవుతో— వాంఛించారు. ఈ పొరపాటువల్ల స్థావరాలు పోయాయి. చిత్రమేమంటే, తమ యెత్తుగడ బెడిసికొట్టేసరికి ఈ తీవ్రవాదులే మితవాదాన్ని ఆశ్రయించారు!

జపాను వ్యతిరేకయుద్ధమప్పుడుకూడా వీరు అదే తప్పుడుధోరణి అవలంభించి, సత్వరవిజయాలు కాంక్షించారు. గెరిల్లాయుద్ధంతంతు మావో సమగ్రంగావివరించాడు: ప్రచ్ఛన్న(గెరిల్లా) యుద్ధాన్ని ఎప్పుడు ప్రత్యక్షయుద్ధంగా మార్చవచ్చునో, ప్రత్యక్ష యుద్ధాన్ని అవసరమైతే ప్రచ్ఛన్నయుద్ధంగా ఎలామార్చాలో మావో స్పష్టంచేశాడు.

ముఖ్యమైన విషయమేమంటే, మావో చీనావిప్లవంతాలూకు అన్నిదశలలోనూ, అన్నిరంగాలలోనూ నిర్దుష్టమైన సూత్రీకరణలూ, నిర్ణయాలూ చేశాడు. మార్క్సిజం-లెనినిజంను వాస్తవపరిస్థితులకు అద్భుతంగా అన్వయించాడు. కుడి యెడమలనుంచి వచ్చిన పెడధోరణులను సరిదిద్దాడు. (అది జరగనప్పుడు నష్టం సంభవించనే సంభ వించింది.)

పదిసంవత్సరాల అంతర్యుద్ధకాలంలో(1927-37)మితవాదం నియమరహితమైన వర్గసమీకరణ ప్రతిపాదించి, ప్రోలిటేరియట్ కు వ్యక్తిత్వం నిరాకరించింది("కూటమే తప్ప సంఘర్షణలేదు"): తీవ్రవాదం ఎలాటికూటమినీ ఆమోదించక ప్రోలిటేరియనులకు అండ నిరాకరించింది. ("ఎలాటికూటమీ లేకుండా అచ్చగా సంఘర్షణే") ఇవి శాస్త్రీయ దృక్పథాలు కావు.

విప్లవసమరంలో అన్ని దశలూ ప్రోలిటేరియన్ విప్లవ విజయానికి సూటిగా ఉండవు. ఎత్తుగడలు మలుపులు తిరుగుతాయి. శత్రువును ప్రతిఘటించాలి, అదే శత్రువుతో చేతులుకలపాలి. కాని ఏ దశలోనూ చరమలక్ష్యాన్ని వెనక్కుపట్టించరాదు. ప్రతి ఎత్తుగడా ఆ లక్ష్యాన్ని దగ్గిరపడేసేదిగానే ఉండాలి. ఈ ఎత్తుగడలు శత్రువును నగ్నంగా బయటపెట్టాలి, అతనిలో విశ్వాసం ఉన్నవారికి కనువిప్పుకలిగించాలి. ఊగిసలాడేవారిని విప్లవంకేసి మళ్ళించాలి. క్రమంగా అసంఖ్యాక ప్రజాకోటిని విప్లవానికి అభిముఖంచేసుకుంటూరావాలి. ఇందుకుగాను మార్క్సిస్టు—లెనినిస్టు మూలసిద్ధాంతాలను తద్దేశతాత్కాలిక పరిస్థితులకు ఎలా అన్వయించాలో తెలియటం గొప్పవిద్య. దాన్ని ఆచరణలో పెట్టటం గొప్ప ప్రతిభ. ఈ విద్యా, ప్రతిభా మావోలో పరిపూర్ణత్వం పొందాయి.

మావోను విప్లవవాదులు ఆరాధించటం సహజం. కాని కావలసినది ఆరాధన కాదు. మావో ఆలోచనావిధానపు అవగాహన. విప్లవాలను ఎగుమతిచెయ్యటం అసాధ్యమన్నట్టే విప్లవ ఎత్తుగడలను కాపీచెయ్యటంకూడా సాధ్యమయేది కాదు. 1927 లో తొలి అపజయం సంప్రాప్తమయాక చీనాకమ్యూనిస్టులు కొమింటర్న్ పైన ఆధారపడటం మానేశారు. కాని మార్క్సిజం-లెనినిజమును వదిలిపెట్టలేదు. మార్క్సిజం-లెనినిజమునేగాక, దేశపరిస్థితులనూ, వర్గస్వభావాలనూ, విప్లవదశలలో వాటిమధ్యకలిగే అనుకూల, ప్రతికూల సంబంధాలనూ చక్కగా అర్థంచేసుకోగలవారే విప్లవాలను సాధించగలరు, మావోచెప్పినట్టు విప్లవంలో అపజయాలుకూడా పనికివచ్చేఅనుభవమే. అపజయాలను విజయాలుగా మార్చుకునే మార్క్సిస్టుదృక్పథం ఎంతైనా అవసరం,

— కొడవటిగంటి కుటుంబరావు.

[ఈ సమీక్షను పురస్కరించుకొని, విరసం ముందుకుదూకటంలేదని విమర్శించే ఉడుకురక్తం వారికి ఒకవిషయం చెప్పటం అవసరమని నాకు అనిపించింది.]

"సోవియట్లకే సమస్త అధికారాలూ" అన్న నినాదం గురించి వివరిస్తూ స్టాలిన్ ఇలా అన్నాడు.

"A strict distinction must be drawn between a formula as a perspective for the immediate future and a formula as the slogan

of the day. It was precisely on this point that the group of Petrograd Bolsheviks... Came to grief in April 1917, when they put forward the slogan, 'Down with the Provisional Government. All power to the Soviets. Lenin at the time qualified that attempt...as dangerous adventurism and publicly denounced it".

[అద్యతన భవిష్యత్తు అవగాహనకు పనికొచ్చే సూత్రానికి తక్షణ నినాద సూత్రానికీ ఖచ్చితమైన వ్యత్యాసం వుంటుంది. ఏప్రిల్ 1917 లో యీ విషయం మీదనే పెట్రోగ్రాడ్ బోల్షివిక్కులు విచార పరిస్థితిలో పడ్డారు. వారు అప్పుడు "తాత్కాలిక ప్రభుత్వం నశించాలి. సర్వాధికారాలూ సోవియట్లకే" అనే నినాదం యిచ్చారు. అపుడు లెనిన్ వారి ప్రయత్నం అపాయకరమైన సాహసవాదం అని నిరసించారు.]

పెట్రోగ్రాడ్ బోల్షివిక్కులు 1917 ఏప్రిల్‌లో చేసిన నినాదం, "తాత్కాలిక ప్రభుత్వం రద్దుకావాలి. అధికారాలన్నీ సోవియట్ల పరంకావాలి," అన్నది సమీప భవిష్యత్తుకు సంబంధించినదేగాని, ఆనాటికి వర్తించేది కాకపోవటంచేత వారు పప్పులో కాలువేశారు. అదేనినాదాన్ని, ఏప్రిల్‌లో ఖండించిన లెనిన్ మరికొద్ది రోజులకు తానే లేవదీశాడు, ఎందుచేత? అది "నేటి నినాదం" అయింది.

ఈ విషయం ఎందుకు ప్రస్తావించానంటే, విరసం "నేటి నినాదాలు" చెయ్యదు, చెయ్యలేదు— ఆ హక్కు విప్లవ రాజకీయవాదులది, విరసం చేపట్టే నినాదాలు సమీప భవిష్యత్తుకుకూడా చెందకపోవచ్చు. అలాటప్పుడు "ఔత్సాహికులు" విరసం నుంచి వేడివేడిగా "నేటి నినాదాలు" రానందుకు ఆగ్రహించటం సబబుకాదు.

ఇప్పుడు సమీక్షించిన ఈ రెండు పుస్తకాలూ విప్లవ కారులేగాక మనలాటి విప్లవవాదులుకూడా శ్రద్ధగా చదవాలి.

కొ. కు. ]

1. Mao Tse-Tung on the chinese Revolution
chen Po-ta Price: Re. 1-60 Paise

2. J. Stalin on Chinese Revolution Price: Rs. 4/-
For above books: New Book Centre,
14, Ramanath Majumdar Street, Calcutta-9

సాహిత్య లేఖలు :

# ఏంజెలా డేవిస్ కమ్యూనిస్టా?

జూలై నెల 'సృజన' చూశాను. ముఖచిత్రం ఏంజెలా డేవిస్. "నీగ్రో ఉద్యమం: ఏంజెలా డేవిస్" వ్యాసం చదివాను. వ్యాసకర్త పేరు లేదు: కాబట్టి సంపాదకవర్గమే రాసిందని అనుకోవచ్చు.

ఎంజెలా డేవిస్‌ను "కమ్యూనిస్టు", "విప్లవకారిణి", "యోధురాలు" అని పేర్కొన్నారు. అయితే అందుకుగల ప్రాతిపదిక ఏమిటో చెప్పలేదు. కొన్ని ఆందోళనా కార్యక్రమాల్లో ఆమె పాల్గొన్నట్లురాశారు. ఆమె అమెరికన్ సామ్రాజ్యవాద ప్రభుత్వ నిర్బంధానికి ఎలాగురైందీచెప్పారు. అయితే "కమ్యూనిస్టు", "విప్లవకారిణి", "యోధురాలు" అవటానికి ఇవి సరిపోతాయా? ఆమె ఏ కమ్యూనిస్టుపార్టీకి చెందిన కమ్యూనిస్టు? ఆ కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలూ, కార్యాచరణా ఎలాంటివి? ఆమె నడుపుతున్న లేక నడిపిన విప్లవోద్యమమేమిటి? ఆమె ఏ విప్లవ సంస్థను నిర్మించింది? లేక నిర్మించే కర్తవ్య నిర్వహణలో నిమగ్నమైవున్నది? అసలు ఆమె ఏ కార్యక్రమాన్ని అమెరికన్ ప్రజల ఎదుట వుంచింది? ఆ కార్యక్రమ నిర్వహణకు ఏ వ్యూహము, ఎత్తుగడలు ఆమె అనుసరిస్తూంది? ఇవన్నీ ప్రశ్నలు.

ఈ ప్రశ్నలజోలికి పోకుండానే "కమ్యూనిస్టు", "విప్లవకారిణి" అనే బిరుదాలు ఆమెకు తగిలించారు.

అమెరికన్ ప్రభుత్వం కేవలం అమెరికా ప్రజలకేగాక యావత్ ప్రపంచ ప్రజలకే ప్రబల శత్రువు. అటువంటి సామ్రాజ్యవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆ దేశప్రజల విప్లవ పోరాటం ఆ దేశప్రజల విముక్తిని సాధించటమేగాక ప్రపంచ ప్రజల విముక్తికికూడా గొప్ప సహాయకారి కాగలదు. మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం ప్రాతిపదికగా శ్రామికవర్గ విప్లవ పోరాటాన్ని జయప్రదం చేయటానికిఅక్కడ నిజమైన విప్లవ పార్టీ ఏర్పడి పనిచేస్తున్నది. సామ్రాజ్యవాదానికీ, గుత్త పెట్టుబడిదారీ పీడనకూ, జాతి వివక్షకూ వ్యతిరేకంగా ఈ విప్లవ పోరాటం ఎక్కుపెట్టబడివుంది.

మరోవైపున నీగ్రో విప్లవకారులు పాలకవర్గాలపైన గట్టిదెబ్బలు తీస్తున్నారు. కొన్ని సంస్థలనుకూడా వారు నెలకొల్పుకొని వాటి పతాకంకింద తమ పోరాటాన్నివారు సాగిస్తున్నారు. ఇంకోవైపున అమెరికన్ సామ్రాజ్యవాదులు వియత్నాంలో చేస్తున్న

యుద్ధానికి వ్యతిరేకంగా అమెరికాలో ప్రజావుద్యమ పెనుతుపానువీస్తూ పాలకవర్గాలను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది.

విప్లవ పార్టీ కార్యక్రమం, నీగ్రోల పోరాటం, వియత్నాంపై యుద్ధవ్యతిరేక ఉద్యమం— ఈ మూడింటిలో దేనికి ఎంజెలా డేవిస్ నాయకురాలు? లేదా దేనికి ప్రతినిధి? లేదా ఎందులో ఆమె కనీసం ఒక సామాన్యకార్యకర్త? ఏవోకొన్ని చట్టబద్ధమైన ఆందోళనల్లో పాల్గొన్నంతమాత్రాన్నే, ఉపన్యాసాలు యిచ్చినంతమాత్రాన్నే, ఉద్యోగం నుండి తొలగింపబడినంత మాత్రాన్నే, కొన్నాళ్లపాటు జైలుజీవితానికి గురి అయినంత మాత్రాన్నే ఎలాంటి నిర్దిష్టమైన విప్లవ పోరాట కార్యక్రమంతో నిమిత్తం లేకుండానే ఎవరైనా "కమ్యూనిస్టు" "విప్లవకారిణి" "యోధురాలు" కాగలరా? ఇలాంటి "కమ్యూనిస్టుల" "విప్లవకారిణుల"పై ఆధారపడి ఎక్కడైనా విప్లవాలు జయప్రదమయ్యాయా?

అసలు విషయాన్ని మీరే ఆ వ్యాసంలో ఒకచోటచెప్పారు. ఆమె "కమ్యూనిస్టు పార్టీలో చేరింది"అని రాశారు. ఏ కమ్యూనిస్టుపార్టీలో చేరింది? విప్లవపార్టీలోనా? కాదు. పచ్చి రివిజనిస్టు పార్టీలో. పేరుకు అది "అమెరికా కమ్యూనిస్టు పార్టీ". అమెరికన్ సామ్రాజ్యవాదానికీ, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదానికీ ఉభయతా ఊడిగం చేస్తున్న పార్టీ అది. ఇండోచైనా, తదితర దేశాల్లో మానవ మారణహోమం గావించుతున్న అమెరికా సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని ఎన్నికలద్వారా కూలదోయవచ్చునని ప్రజల్లో భ్రమలు కలిగిస్తున్నపార్టీ అది. ఐసెన్‌హోవర్‌కన్నా కెన్నెడీ మంచివాడనీ, గోల్డ్‌వాటర్‌కన్నా జాన్సన్ విజ్ఞుడని చెబుతూ సామ్రాజ్యవాదుల వకాల్తాదారుగా వ్యవహరించేపార్టీ అది. ఆ పార్టీలో సభ్యురాలు ఎంజెలా డేవిస్. ఆ పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి పనిచేస్తున్నవ్యక్తే మీరు "కమ్యూనిస్టు" "విప్లవకారిణి"గా శ్రమపడివర్ణించిన కుమారి ఎంజెలా డేవిస్.

అయితే ఆమె ఉపన్యాసాలు రివిజనిస్టుపార్టీ కంటే ఎక్కువ పోరాటస్వభావాన్ని కలిగివున్నట్లు కనబడతాయి. అహింసద్వారా విప్లవ విజయాన్ని సాధించలేమనిచెబుతూ ఆ పార్టీతో ఆ అంశంపైన సిద్ధాంతరీత్యా విభేదిస్తున్నట్లు కనపడుతుంది. హింసపైన విప్లవహింస ప్రయోగించాలా, వద్దా అనేది విప్లవకారులనూ, రివిజనిస్టు విప్లవ ప్రతీఘాతకులనూ విడదీసే ప్రాథమికమైన విభజన రేఖ. అంతటి మౌలికమైన అంశంపైన ఆమె తన పార్టీతో నిజంగానే విభేదిస్తూవుంటే ఆ పార్టీలోనే కొనసాగటం ఆమె నిజాయితీకి చిహ్నం కాదు. ఆపార్టీ కార్యక్రమాన్ని ప్రజలయెదుట బహిరంగంగా ఖండించి దాంతో తెగదెంపులు చేసుకొని నిజమైన విప్లవ పక్షానికి ఆమె వచ్చియుండవలసింది. కానీ ఆమె ఆ పని చెయ్యలేదు ఆటువంటి పార్టీలో వుంటూ ఆమె విప్లవపోరాటాలకు

ప్రాతినిధ్యం వహించటం అసాధ్యం గదా? వాస్తవంలోగూడా ఆమె ప్రాతినిధ్యం వహించిన విప్లవోద్యమాలేవైనా వున్నాయా అంటే అదీ లేదు.

అందుకనే ఆమె రివిజనిస్టు పార్టీకి అభ్యంతరమైన వ్యక్తి కాకుండా పోయింది. విప్లవ కార్యక్రమంపట్ల మొగ్గుచూపిన తమ సభ్యులనెందరిని రివిజనిస్టు పార్టీలు "క్రమ శిక్షణ", "పార్టీ వ్యతిరేక కార్యకలాపాల" పేరిట తొలగించివేయలేదు. ఇతర దేశాల చరిత్ర, మన దేశచరిత్ర ఒకసారి జ్ఞప్తికితెచ్చుకొంటే ఈ వాస్తవం మనకు బోధపడదా? మరి ఎంజెలా డేవిస్ రివిజనిస్టు పార్టీకి అభ్యంతరకరమైన వ్యక్తి కాకపోగా యెందుచేత ఆమెను ఆ పార్టీ ఆకాశానికెత్తుతున్నది? ఆమె రివిజనిస్టుపార్టీ యిముడ్చుకోగల "కమ్యూనిస్టు"; రివిజనిస్టు కార్యాచరణకు తగిన "విప్లవకారిణి"; రివిజనిస్టు పోరాటాలకు పనికి వచ్చే యోధురాలు".

అందుకే ఆమె విడుదలకోసం మన దేశ రివిజనిస్టులతోసహా ప్రపంచరివిజనిస్టులంతా పెద్ద ఉద్యమాన్ని నడిపారు. నక్సల్బరీ విప్లవ రైతుల రక్తం తాగిన రివిజనిస్టు రాక్షసులూ, కేరళలో విప్లవకారుడు కామ్రేడ్ వర్గీస్‌ను హత్యచేసిన రివిజనిస్టు కిరాతకులూ, దేశవ్యాపితంగా వందలాది మంది విప్లవకారులను పట్టుకొని నిలువునా కాల్చి చంపుతూ, వేలాది మంది విప్లవకారులను క్రూర నిర్బంధాలకు గురిచేస్తున్న అభివృద్ధి నిరోధక కాంగ్రెసు ప్రభుత్వానికి సిగ్గూ, లజ్జా లేకుండా పల్లకీమోస్తున్న రివిజనిస్టులూ, ఎంజెలా డేవిస్ విడుదలకోసం పెద్ద ఉద్యమాన్ని నడపటం గమనార్హం. అలాగే ప్రతి దేశంలోనూ అభివృద్ధినిరోధక పాలకవర్గాలకు ఊడిగం చేస్తున్న రివిజనిస్టు పార్టీలన్నీ ఎంజెలా డేవిస్ విడుదలకొరకు ఆందోళన చేయటంలో అర్థం లేదనగలమా?

అమెరికా ప్రజల పోరాటంలో ప్రాణాలర్పించిన అమరవీరులకుగానీ, జీవించి వున్న నిజమైన విప్లవకారులకుగానీ లేనంత ప్రపంచవ్యాపిత ప్రచారం ఎంజెలాడేవిస్‌కు ఎందుకు లభించింది? నిజమైన విప్లవపోరాటాలవైపు ప్రజలు ఆకర్షించబడకుండా, వారిని పక్కదారులు పట్టించటం సామ్రాజ్యవాదులు, సోషల్‌సామ్రాజ్యవాదులు, వారితొత్తులు వేసే ఎత్తుగడల్లో ఒకటి. ఎంజెలా డేవిస్‌ను ఆకాశానికెత్తటంలో సామ్రాజ్యవాదుల, సోషల్ సామ్రాజ్యవాదుల, వారి తొత్తుల, వారందరి ప్రచారసాధనాల పాత్ర లేదనగలమా? ఎంజెలా డేవిస్ కేసు విచారణ తంతును పరిశీలించటానికి ఒక పరిశీలక బృందాన్ని పంపవలసిందిగా సోవియట్ ప్రభుత్వాన్ని అమెరికా ప్రభుత్వం కోరింది. అమెరికాలో నిర్బంధంలో మగ్గుతున్న అసంఖ్యాక విప్లవకారులపట్ల లేని ఇంత ప్రత్యేక శ్రద్ధ రెండు అగ్రరాజ్యాలకూ ఎంజెలా డేవిస్‌పట్లనే ఎందుకు కలిగినట్లు?

ప్రజల దృష్టిని పక్కదారులు పట్టించటానికి, ప్రజల పోరాట స్వభావాన్ని దిగ జార్చటానికి అభివృద్ధి నిరోధక పాలక వర్గాలూ, వారి ప్రచార సాధనాలూ కొందరు వ్యక్తులను ప్రజా "నాయకులు"గానూ "ప్రతినిధులు"గానూ ఒక పథకం ప్రకారం పనిగట్టుకొని ప్రచారం చేస్తూంటాయి. తమ తొత్తు ముఠాల గురించీ, వ్యక్తులను గురించి సినిమా తారలకన్నా ఎక్కువగా పతాక శీర్షికలతో, పలు రకాల ముఖ చిత్రాలతో ఆకాశానికి ఎత్తుతూ వుంటాయి. తమ ప్రయోజనాలకు నిజంగా ప్రమాదం కాని "వీరుల"ను పాలక వర్గాలు తమ వద్దగల యావత్ ప్రచార యంత్రాంగాన్నంతటినీ వినియోగించి పైకెత్తుతూంటాయి. తమకు నిజమైన నాయకులెవరో ప్రజలను నిర్ణయించుకోనివ్వకుండా పాలకవర్గాలే నిర్ణయించి వారిపైన రుద్దుతూంటాయి. బూటకపు విప్లవకారులను "విప్లవ నాయకులు"గా పాలకవర్గాలే నిర్ణయించి ప్రచారంచేస్తుంటాయి. విప్లవ ప్రజలూ కార్యకర్తలూ నిరాకరించిన వారిని కూడా "నాయకులు"గా చిత్రించుతూ కొంత మేరకైనా ప్రజలను గందరగోళ పరచగలమని ఆశిస్తూవుంటాయి.

అయితే ఏవో కొన్ని ఆందోళనల్లో పాల్గొని కొంత మేరకు ప్రభుత్వ నిర్బంధానికి గురైనంత మాత్రం చేతనే 'ఏంజెలాడేవిస్'లను గానీ, లేదా కొంత కాలం విప్లవ పోరాటంలో పాల్గొని ఆ తర్వాత విప్లవ రాజకీయాలకూ, విప్లవ పోరాటానికీ ద్రోహం చేస్తున్న మాజీ విప్లవకారులను గానీ ప్రజలు తమ నాయకులుగా ఎంచుకోరు. వారి రాజకీయాలనూ, వారి కార్యాచరణనూ పరిశీలించటం ద్వారానే ఎవరినైనా విప్లవకారులుగా, విప్లవ నాయకులుగా భావిస్తారు.

కానీ, విప్లవ కార్యక్రమానికి ప్రాతినిధ్యం వహించని ఎంజెలాడేవిస్‌ను పైకెత్తి భూతద్దంలో చూపించటంలో పైన చెప్పిన ముగ్గురి సామ్రాజ్యవాదుల, సోషల్ సామ్రాజ్యవాదుల, వారి తొత్తుల- ప్రయోజనాలు యిమిడి వున్నాయి. కానీ విప్లవ పోరాటానికి ప్రోత్సాహం కల్పించే సాహిత్యం అందజేసే 'సృజన' ఎంజెలా డేవిస్‌ను గురించి యిప్పటికే ప్రపంచంలోనూ, దేశంలోనూ అయిన ప్రచారం చాలదా అన్నట్లు పెద్ద ఆర్భాటం చేయటమే గాక పూర్తిగా అవాస్తవికమైన చిత్రీకరణ చేసింది. ఎంజెలా డేవిస్ ఆదర్శాన్ని చూపటం ద్వారా అటు అమెరికన్ ప్రజలను గానీ, ఇటు భారత ప్రజలనుగానీ, లేదా ప్రపంచ ప్రజలనుగానీ ఉత్తేజపరచటం సాధ్యం గానిపని. పైగా తద్వారా వచ్చేవి విరుద్ధమైన ఫలితాలే తప్ప విప్లవ ఫలితాలు కావు. విప్లవ పోరాటంతో సంబంధంలేని ఇతర జీవిత సంఘటనలను ఎంత ఉత్ప్రేక్షించి చెప్పినా, ఎంత చక్కటి భాషలో పొదిగినా ఆ వ్యాసం నిస్సారంగా వుండిపోవటంలో ఆశ్చర్యం లేదు. వాస్తవానికి అందులో విప్లవోన్ముఖంగా ఉత్తేజపర్చ గలిగిందేమీలేదు.

ఈనాడు 'సృజన' అందించవలసింది రివిజనిస్టు, విప్లవ ప్రతిఘాతకులు దాకా లూదే ఎంజెలా డేవిస్‌ల అర్థంలేని ముఖ చిత్రాలనూ, పనికిరాని జీవిత చిత్రణలనూ కాదు. భారత విప్లవాకాశంలో అరుణ తారలుగా ప్రకాశించుతూ ఎర్రని కాంతులు విరజిమ్ముతూన్న పంచాది నిర్మలల, గౌరకల అంకమ్మల, తెలకల నరప్పతుల పోరాట జీవిత గాధలు 'సృజన'కు కథావస్తువులు కావాలి. రైతాంగ, శ్రామిక విప్లవ కారుల, విప్లవకారిణుల వీరోచిత కృత్యాల చిత్రీకరణలతో 'సృజన' విప్లవ 'సృజన'గా రూపొందాలి.

ఎంజెలా డేవిస్‌ను అమెరికా ప్రజా 'నాయకురాలి'గా చిత్రించటానికి భారతదేశ రివిజనిస్టు పత్రికలేగాక, బూర్జువా పత్రికలు గూడా బహు ప్రయాస పడుతున్నాయి. ఈ దేశంలో గొప్ప విప్లవ మేధావి, విప్లవ రచయిత, గొప్ప విప్లవకారుడూ అయిన కామ్రేడ్ సరోజ్ దత్తాను అభివృద్ధి నిరోధక పాలకవర్గాలు అర్ధరాత్రివేళ గుట్టుచప్పుడు లేకుండా కాల్చి హత్యచేస్తే కనీసం ఆ వార్తను గూడా ఈ పెట్టుబడికి, కట్టుకథకు పుట్టిన విష పత్రికలు ప్రచురించనైనా లేదు. ఆ పని 'సృజన' కూడా చెయ్యకపోవ డమే విచారించవలసిన విషయం. మన దేశ ప్రజల విముక్తి పోరాటంలో తమ అమూల్యమైన ప్రాణాలర్పించిన బాబూలాల్, విశ్వకర్మార్కర్లనూ, దయాసింగులనూ, వర్గీస్‌లనూ, కోరన్న, మంగన్న, రింజిము, భీమన్న, వెంపటాపు సత్యం, పంచాది కృష్ణమూర్తి, డా॥ భాస్కర్ రావు, డా॥ మల్లికార్జునుడు, సుబ్బారావు పాణిగ్రాహి, తామాడ గణపతుల నెవ్వరినీ ఎంజెలా డేవిస్‌ను చిత్రించినట్లుగా ఈ పత్రిక లేవీ ప్రజా నాయకులుగా పేర్కొనటం లేదు, అందుకు విరుద్ధమైన తుచ్ఛపు ప్రచారాన్ని అవి సాగించటం మనం చూస్తున్నదే. ఎంజెలా డేవిస్‌ను భూతద్దంలో చూపిస్తూ ఈ దేశ ప్రజల విముక్తికోసం ఆత్మ బలిదానం గావించిన మహా వీరులను విరసించ టంలోగల ఆంతర్యం మనకు బోధపడదా? ఈ తేడాకుగల కారణం వారి వర్గ ప్రయో జనాలు కాదా? కాబట్టి ఎంజెలా డేవిస్‌ను "విప్లవకారిణి"గా చూపెట్టటం ద్వారా ఏ వర్గ ప్రయోజనాలను నెరవేర్చినవారౌతున్నారో 'సృజన' సంపాదకులు గ్రహిస్తారని ఆశిస్తున్నాను.

భారత దేశంలో ఈనాడు మహత్తరమైన రైతాంగ సాయుధ పోరాటం జయ ప్రదంగా సాగుతోంది. అభివృద్ధి నిరోధక పాలకవర్గాలకు వ్యతిరేకంగా భారత ప్ర జలు నేడు అంతర్యుద్ధంలో వున్నారు. విప్లవ ప్రతిఘాతుక హింసపైన విప్లవ హింసను ప్రయోగిస్తున్నారు. మానవుణ్ణి మానవుడు దోచుకొనే, పేదలను అమానుషంగా హింసించే ప్రస్తుత దోపిడీ, హత్యా వ్యవస్థను సమూలంగా నేల మట్టం గావించి జనతా ప్రజాస్వామిక వ్యవస్థాపన కోసమై సాగుతున్న సాయుధ పోరాటంలో రైతులూ, కార్మి

తులూ మొదలు విద్యార్థులు, కళాకారులు, మేధావుల వరకూ వీరోచితంగా పాల్గొంటున్నారు. ఘన విజయాలు సాధిస్తున్నారు. అదే సమయంలో అనేక కష్టనష్టాలకూ కఠోరమైన జీవితానికీ ఓర్చుకొంటూ పోరాటాన్ని ముందుకు తీసుకుపోతున్నారు. పోరాటంలో ఎనలేని త్యాగాలను, చివరికి అత్యున్నతమైన ప్రాణత్యాగాలనూ వారు చేస్తూ భారత విప్లవ బాటను ప్రకాశవంతం చేస్తున్నారు. తుపాకీని గుండెలపై ఎక్కుపెట్టినా ఆ వీరులు కొనప్రాణం వున్నంత వరకూ విప్లవ నినాదాలతో ప్రజల్ని ఉత్తేజపరుస్తున్నారు. ఉరికంబం ఎక్కవలసి వచ్చినా విప్లవ రాజకీయాలకే వారు ఆధిపత్య స్థాన మిస్తున్నారు తప్ప అభివృద్ధి నిరోధకుల బూర్జువా కోర్టుల్లో విశ్వాసం ప్రకటించటం లేదు. ప్రాణభిక్ష పెట్టమని పాలక వర్గాల అధినేతల పాదాల ముందు మోకరిల్లటం లేదు.

ఈ మహత్తర విప్లవ పోరాటానికి ప్రాతిపదికగా గల మావో ఆలోచనా విధాన సిద్ధాంతాలనూ, జనతా ప్రజాస్వామిక విప్లవ రాజకీయాలనూ 'సృజన' పుటలు ప్రతిబింబించాలే కాని సామ్రాజ్యవాదుల చట్టాలకు లోబడి జరిగే, బూజుపట్టిన పాత వ్యవస్థకే నగిషీలు చెక్కే ఆందోళనలనబడే వాటి ప్రచారానికి వేదిక కారాదు. జనతా ప్రజాస్వామిక విప్లవంలో దేశవ్యాప్తంగా విప్లవకారులు ప్రదర్శిస్తున్న అసామాన్యమైన విప్లవ వీరత్వం, వారు అనుభవిస్తున్న కఠోరమైన జీవితం, వారు చేస్తున్న ఎనలేని త్యాగాలు- ఒక్క మాటలో చెప్పాలంటే విప్లవకారుల పోరాట జీవితం, విప్లవకారుల వీరోచిత మరణాలకు సంబంధించిన వీరగాథలు 'సృజన' రచనలకు కథా వస్తువులు కావాలే గాని ఆచరణలో పాత వ్యవస్థకే ప్రాణభిక్ష పెట్టజూస్తున్న విప్లవ ప్రతీఘాతకుల ముద్దుబిడ్డ ఏంజెలాడేవిస్ కథలు కాదు.

వాస్తవంగా ఈనాడు అమెరికాలో మావో ఆలోచనావిధానం ప్రాతిపదికగా పని చేస్తున్న విప్లవకారులూ, ఇతర విప్లవకారులూ అసంఖ్యాకంగా వున్నారు. వారినెవరినీ సామ్రాజ్యవాద పత్రికలుగానీ, సోషల్ సామ్రాజ్యవాద పత్రికలుగానీ, రివిజనిస్టు పత్రికలుగానీ ఏంజెలా డేవిస్‌ను పైకెత్తినట్లుగా ఎత్తటం లేదు. అది ఆశ్చర్యకరమైన విషయమేమీకాదు. వారి వర్గప్రయోజనాలకు అనుగుణంగానే వారు వ్యవహరిస్తున్నారు. ఏంజెలాడేవిస్ నిర్బంధంలోవున్న సమయంలోనే నీగ్రో విప్లవకారుడు జార్జి జాక్సన్‌ను కాల్చిచంపారు. అంతకుముందు జార్జి జాక్సన్ తమ్ముడు జొనాథన్ జాక్సన్‌ను కోర్టులో పట్టపగలు బహిరంగంగా కాల్చి హత్యచేశారు. ఇంకా అనేక మంది విప్లవకారులను సామ్రాజ్యవాద ప్రభుత్వం బలితీసుకొంటున్నది. వారెవరికీ ఏంజెలా డేవిస్‌కు లభించినంత బహుళ ప్రచారం అభివృద్ధి నిరోధకుల ప్రచార సాధనాల్లో లభించటం లేదు.

అందుకు కారణం మనం గ్రహించలేమా? మరుగున పడిపోయిన నిజమైన విప్లవకారులైన జాక్సన్ తదితర విప్లవకారుల వీరోచిత గాథలను వెలికితీసి 'సృజన' పాఠకుల కందించాలి.

భారత విప్లవాన్ని జయప్రదం చేయటం భారతప్రజల ప్రధానమైన కర్తవ్యం. అమెరికా విప్లవానికిగానీ, ప్రపంచ విప్లవానికిగానీ వారు సహాయం చెయ్యగల ప్రధాన రూపం భారత విప్లవపోరాటాన్ని కొనసాగించటమే. ఈ దేశంలోగల సామ్రాజ్యవాద, సోషల్ సామ్రాజ్యవాద అనుకూల భూస్వామ్య. దళారీ నిరంకుశ పెట్టుబడిదారీవ్యవస్థను చెక్కుచెదర నివ్వకుండావుంటూ ప్రపంచంలోసాగే జాతీయ విముక్తి విప్లవాలకు మనం సహాయం చెయ్యగల మనుకోవటం పచ్చి మోసం. దగా. ఈ వ్యవస్థను యిక్కడ కాపాడటమంటే ప్రపంచ సామ్రాజ్యవాదానికీ. సోషల్ సామ్రాజ్యవాదానికీ బలం చేకూర్చి పెట్టటమే. ప్రపంచవ్యాపితంగా సాగే జాతీయ విముక్తి విప్లవాలకు ఆచరణలో విద్రోహం చెయ్యటమే. అందువల్ల మనదేశవిప్లవ పోరాటరాజకీయాలనూ, విప్లవకారుల వీరోచితగాథలనూ ప్రజలకందివ్వటం విప్లవసాహిత్య సంస్థల, విప్లవ పత్రికల ప్రథమ కర్తవ్యం. ఎంజెలా డేవిస్‌లను గురించి ఎంతగానైనా రాయవచ్చు. అదొక ఫాషన్ గూడా. దానివల్ల ఏలినవారికి కోపం రాదు. పైగా వారు సంతోషిస్తారు. మెచ్చుకొంటారుకూడా. ఆ చెత్తరాయటానికి విప్లవ సంస్థలు, పత్రికలు అవసరం లేదు. ఆ పని బహుళంగా చేసి పెట్టటానికి ప్రధాన సాధనాలు ప్రపంచమంతటా కోకొల్లలుగా వున్నాయి. అధికారం చేతుల్లోగల అనేక రాజ్యాలే ఆ పనికి పూనుకొని వున్నాయి. ఏదో నెలకొకసారీ, అదీ ఏవో కొద్దిపాటి పేజీలతో, విప్లవసాహిత్యాన్ని అందజేయటం తన ధ్యేయంగా పెట్టుకొని అనేకానేక ఇబ్బందులతో వెలువడుతున్న పేదపత్రిక 'సృజన' ఎంజెలా డేవిస్‌ల కథలు ప్రచారంచేసే "లగ్జరీ"(విలాసం)ని అనుభవించగలదా? దానివల్ల 'సృజన' ప్రజలకు అపచారం చేసిందే అవుతుంది. తాను ప్రకటించుకొన్న లక్ష్యం వైపునుండి మరలి సాధారణ పత్రికల బాట పట్టినదౌతుంది, దాని గౌరవప్రతిష్ఠలు పడిపోతాయి, ఇలా జరగకూడదనేనా ఆవేదన.

గతంలోకూడా 'బంగ్లాదేశ్' అవామీలీగ్ బూటకపు విప్లవకారులను నిజమైన విప్లవకారులుగా చిత్రించి 'సృజన' పెద్ద తప్పు చేసింది. ఇప్పుడు మళ్ళీ కుహనావిప్లవకారిణిని నిజమైన విప్లవకారిణిగా చిత్రించటానికి లేనిపోని ప్రయాసపడి, ఆప్రయత్నంలో సహజంగానే విఫలమైంది. ఇలాంటివి మళ్ళీ జరగ్గూడదనే 'సృజన' అభిమానిగా నేను కోరుకొంటున్నాను, నవ ప్రపంచం కోసం, నూతన భారతదేశం కోసం

భూమ్యాకాశాలను కదలిస్తున్న విప్లవ పోరాట వీరగాథల ప్రతిబింబంగా "సృజన" మరింతగా ముందుకు రావాలని ఆకాంక్షిస్తున్నాను.

13-7-'72
విశాఖపట్నం

ఇట్లు,
ఒక అభిమాని

సమాధానం :—

ఎంజెలాడేవిస్ గురించి ప్రచురించటంలో మా ఉద్దేశం, అమెరికాలోని నీగ్రో విప్లవోద్యమాన్ని, అందులోనూ ప్రత్యేకంగా జొనాథన్, జార్జి జాక్సన్‌ల గురించి వారి గ్రూపు త్యాగాలగురించి కొంత పరిచయంచేయాలనే, అందుకు ఏంజెలాకేసు విచారణ ఉపయోగపడుతుందనే ఆ వ్యాసం ప్రకటించటం. అది మా స్వంతవ్యాసంకాదు, ఆ ఉద్యమానికి సంబంధించి అమెరికానుంచి వచ్చిన పుస్తకం ఆధారంగా రాసింది.

విప్లవ సాహిత్యాన్నిగురించి లేఖకుని భావాలతో మేం ఏకీభవిస్తున్నాం, లేఖకులు జొనాథన్ గురించి రాయొచ్చన్నారు. కాని జొనాథనూ, ఏంజెలా ఒక గ్రూపువారే. ఆయన్ను చంపగల్గారు. ఈమెను చంప ప్రయత్నించి జైల్లో మాత్రం వుంచగల్గారు.

అమెరికాలో ఒకే కమ్యూనిస్టు పార్టీ వుంది. అందులోని సభ్యులనే అక్కడ కమ్యూనిస్టులంటారు. అదే పదాన్ని, ఆపుస్తకంలోనిపదాన్నే మేమూ వినియోగించాము పైగా ఆపార్టీ మౌలికవిధానాలతో విభేదిస్తూ హింస, విప్లవకార్యాచరణకు ఆమె ముందుకొచ్చి అందులోనే చేగువేరా లుముంబా క్లబ్ ఏర్పరచి పనిచేస్తోంది.

అంతర్గత విభేదాలూ, విధానాల వ్యత్యాసాలు, పార్టీ గ్రూపు అనుబంధాలు ఎలావున్నా జనరల్‌గా విప్లవయుతమైన కార్యాచరణకు ముందుకొచ్చే అందరనూ అన్ని ఉద్యమాలనూ సాహిత్యపరంగా బలపరచటం మంచిదని అనుకుంటున్నాం.

ఏంజెలా ఎలాంటి కమ్యూనిస్టు? ఏ వ్యూహం ఎత్తుగడలను అనుసరిస్తున్నది అన్నంత లోతులకు వెళ్ళి ఆలోచించటం సృజనకు అసాధ్యమైనపని.

ఆమె తన ఆశయాలను ఆచరణకు జోడించుకుంటూ త్యాగాలకు సిద్ధపడుతూ అణగారిన తన ప్రజలతరపున నిలబడడమే 'యోధురాలు' 'విప్లవకారిణి' అనటానికి కారణం. అంతవరకే; అంతకంటే పెద్ద అర్థాలు యిచ్చికాదు.

ఈ మా దృష్టిని సృజనకున్న పరిమితులను లేఖకులు అర్థంచేసుకొనగలరని ఆశించుతాము, ఏంజెలాగురించి కంటే యింకా చాలామంది గురించి రాయగల్గితే సరిగా వుండేదని మేమూ అంగీకరిస్తాం. అంతమాత్రాన ఏంజెలా గురించి అభినందిస్తూ రాయడం తప్పుకాదనే మా భావం. 'బంగ్లాదేశ్' అవామీలీగ్ బూటకపు విప్లవకారులను నిజమైన విప్లవకారులుగా సృజన చిత్రించలేదు.

# విప్లవ సాహిత్యం

ఈనాడు బూర్జువా పత్రికలు తిరుగుబాటు సాహిత్యం గురించి వార్తలు ప్రచు రిస్తున్నాయి. సాహిత్యం ఎప్పుడు అభ్యుదయమే కాంక్షిస్తుంది, కాని ఆ సాహిత్యం వర్గ దృష్టినీ, వర్గ వైరుధ్యాలనూ ప్రచారం చేసినప్పుడే విప్లవ సాహిత్యస్థాయి నందు కుంటుంది. ఈ బూర్జువా పత్రికలు ఆఫ్రికా, లాటిన్ అమెరికా, బంగ్లాదేశ్‌లలోని గెరిల్లా కవులను అభినందిస్తున్నవి. గత మార్చి 28 న, న్యూఢిల్లీలో జరిగిన జాతీయ రచయితల శిబిరంలో పాల్గొన్న రచయితలు నెరూడా కవితలోని పోరాటతత్వం పొగి డారు, తుపాకుల నెదుర్కొంటూ కవితరాసే విదేశీ కవులకు అభినందన పరంపర లందు తున్నాయి. గ్వాటిమాలాకు చెందిన గెరిల్లాకవి ఆటోరెని కేస్టిల్లో (Otto Rene Castillo) పట్టుబడి, సజీవ దహనం చేయబడిన సందర్భంలో ఇంగ్లీషులో రచించే ఒక 'గొప్ప' భారతీయకవి తమ విచారం వెళ్ళబుచ్చారు.

జాతీయ రచయితల శిబిర రచయితలుకూడా ఈనాటి వ్యవస్థకు ఎదురుతిరగమని చెప్పే కవులపట్ల రచయితలపట్ల జరుగుతున్న రాక్షస పోలీసు చర్యలను ఖండించారు. రచయిత సాంఘికన్యాయం, సామాజిక సత్యాల గురించి ప్రచారం చేయాలి, నిబద్ధత అవసరం అన్న విషయంపై ఈ శిబిరంలో రచనలు సమర్పింపబడినవి. భారత దేశం లోని 'యువకిశోరాల'గురించి వారు 'విప్లవపంథా'అనే తప్పుడు త్రోవలో ప్రయాణిం చడం గురించి ఈ రచయితలు ప్రస్తావించినా, 'విప్లవరచయితలు' ఏవిధంగా ప్రత్యక్ష పోరాటానికి దిగి మరణించిన సంగతీ, జైళ్ళలో మగ్గిన మగ్గుతున్న సంగతి గురించీ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. భారతీయ రచయితల కుత్సితపుబుద్ధి ఈ ఒక్క ఉదా హరణ వెల్లడిచేస్తుంది. ఇట్లాంటి రచయితలే ప్రభుత్వం యిచ్చే చప్పుబహుమతులకు అమ్ముడుపోయి రచనలు సాగిస్తారు.

ఇక భారతీయ పత్రికలు పాలకవర్గానికి కొమ్ము కాస్తున్నాయనటంలో అసత్యం లేదు. భారతప్రభుత్వం తిరుగుబాటు కవులు, రచయితలపై ఆంధ్రప్రదేశ్‌లో(శ్రీశ్రీ జ్వాలాముఖి, యం.టి. ఖాన్ మొ॥) ఉత్తరప్రదేశ్‌లో (కాంచన్‌కుమార్, రామ్‌ధని) బీహార్‌లో (అలోక్‌ధన్వా, వేణుగోపాల్) ఢీల్లీలో(హన్స్‌రాజ్‌రహబర్) బొంబాయిలో (జగదాంబప్రసాద్ దీక్షిత్) పంజాబ్‌లో దాడిచేసినప్పుడు ఈ పత్రికలు ప్రభుత్వాన్ని ఖండించకుండా మౌనంవహించాయి. ఆంధ్రలో కత్తి, కలం చేతబట్టిన సవ్యసాచి సుబ్బారావు పాణిగ్రాహి ధైర్యస్థైర్యాలు విప్లవ సాహిత్య చరిత్ర కెక్కవలసినవే.

1970లో పంజాబ్ రాష్ట్రంలో అప్పటికి వస్తున్న నిర్జీవమైన నపుంసక కవితకు చెంపపెట్టుగా, ఒక కొత్తఉద్యమం బయలుదేరింది, సాయుధరచయితలను పంజాబ్‌లో చిత్రహింసలపాలు చేశారు. అచట అసంఖ్యాకులైన యువ విప్లవ కవులు పోలీసు 'పోరాటాల'లో చంపబడ్డారు. కొందరు రచయితలపై హత్యానేరాలు మోపబడినవి. వారిని పట్టియిచ్చినవారికి బహుమతులుకూడా ప్రకటింపబడినవి. పంజాబీ మాసపత్రిక 'హేమజ్యోతి'పై ప్రభుత్వం నిషేధాజ్ఞలు పెట్టింది. దాని సంపాదకుడు సురేందర్‌ను అంతరంగిక భద్రతాచట్టం క్రింద చెరసాలలో పెట్టారు. గత ఆరు నెలలుగా ఖైదులో వుండి విచారణకొరకు యెదురుచూస్తూ కాలం గడుపు తున్నాడు. ఇక మిగిలిన ఒకటి రెండు పంజాబీ పత్రికల సంపాదకులకు, వాటి రచయితలకు ప్రభుత్వం భయభ్రాంతు లయ్యే పరిస్థితులు కల్పిస్తోంది. కాని యీ కిశోరాలు యీ ప్రభుత్వానికి లొంగరు. పంజాబీ యువకవులు లాల్‌సింగ్‌దిల్, దర్శన్ ఖాట్కర్, అమర్‌జీత్ చందన్(రెండు రహస్యపత్రికలకు సంపాదకత్వం వహించారు), హర్‌భజన్ హల్వారీ, పాప్, గురు దీప్ గ్రేవాల్ తమపై జరిగిన దాడులను ధైర్యంగా ఎదుర్కొన్నారు. పంజాబీసాహిత్యా కాశంలో నూత్న వెలుగులను వెదజల్లుతున్న యువరచయితలు వీరు.

దోపిడిపై ఆధారపడివున్న సాంఘిక వ్యవస్థలో యధాతధవాదులకు మాత్రమే బహుమతులు లభిస్తాయిగాని. ఆ వ్యవస్థను సమూలంగా పెకలించాలనే వారికి రావు. ఐతే తిరుగుబాటుదార్లకుకూడా బుల్లెట్ల బహుమతులు లభిస్తున్నాయి. ఈ కుళ్లవ్యవస్థను సుస్థిరం చేయాలన్న భావనతో రచనలుచేసే భారతీయ రచయితలు యికనైనా కళ్ళు తెరచి— తుపాకీ గుళ్ళను యెదుర్కొంటూ, జైళ్లను లెక్కచేయకుండా— నిబద్ధతతో, చిత్తశుద్ధితో సాహిత్యం సృష్టిస్తున్న రచయితలను గమనించాలి. ఐతే వాళ్ళు గమ నించినా, గమనించకపోయినా మనకు ఏవిధమైన నష్టమూ లేదు.

చండీఘర్ — యుగజీత్

[జులై 8, 1972 ఫ్రాంటియర్ నుంచి అనువాదం-కొరవి]

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ నిర్బంధాలకు, దాడులకు, దమననీతికి విప్లవ రచ యితల సంఘం, సానుభూతిపరులు గురయ్యారని, కిషన్, డాక్టర్ ఎం. వి. రమణా రెడ్డి, జ్వాలాముఖి, చెరబండరాజు, నిఖిలేశ్వర్‌లు జైలుశిక్షలనుభవించారని పాఠకులకు విదితమే.

పైరచయితల ఇళ్ళపై ఇంకా విప్లవ రచయితల సంఘ కార్యవర్గ సభ్యులైన ఎం.టి. ఖాన్, చంద్ర ఇళ్ళపైననేకాకుండా మంజుశ్రీ, డి. వెంకట్రామయ్య, ప్రభం

జన్‌వంటి రచయితల ఇళ్ళపైకూడా పోలీసులు అర్ధరాత్రి దాడిచేసి సోదాచేసి పుస్తకాలు ఎత్తుక పోయినవిషయంకూడ మన అకాడమీలు, పరిషత్తులు అలా వుంచండి. కనీసం అభ్యుదయ రచయితలమని చెప్పుకునేవాళ్లకూడ ఖండించలేదు. దేశంలో వెలువడిన పది ఉత్తమ గ్రంథాల్లో ఒకటిగా బి. వి. కేస్కర్‌గారిచేత పేర్కొనబడి నేషనల్ బుక్ ట్రస్టువారు ఏర్పాటుచేసిన ప్రపంచపుస్తక ప్రదర్శనలో ప్రదర్శించబడ్డ 'ఇపుడువీస్తున్న గాలి' కథాసంకలనాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిషేధిస్తే యీ సెమీఫాసిస్టు ప్రభుత్వంలోని వైరుధ్యాలను వేలుపెట్టిచూపేపాటి సాహసంకూడ యీ 'నిరంకుశులైన'కవులు రచయితలు చేయలేకపోయారు. అహా, ఈ దేశంలోని రచయితలు, మేధావులు ఎంత గొప్ప భావస్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నారు!

— సంపాదకుడు

'మార్చ్' సంపాదకునికి జరిమానా:

'మార్చ్' కవితాసంకలనం సంపాదకుడు పి. కిషన్‌రావుకు జనగామ కోర్టు ఆరు నెలల కఠిన శిక్ష లేదా ఐదువందల రూపాయల జరిమానా విధించింది. కొన్ని పత్రికలలో ఈ వార్త ఆరు నెలల కఠినశిక్షతోపాటు ఐదు వందల రూపాయల జరిమానా వేసినట్లు వచ్చింది. అది సరికాదు,

'ఇపుడు వీస్తున్నగాలి' ఎదురుకు ముక్కుమూసుకున్న ప్రభుత్వం:

విప్లవం పోజుతోనో, నినాదాలతోనో వచ్చేదికాదు. భూసంస్కరణలు గొప్ప విప్లవాత్మకచర్యగా గొంతుచించుకొని ఊరేగుతున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, కేంద్రంకూడా ఇటీవల కాలంలో వెలువడిన పదిఉత్తమ గ్రంథాల్లో ఒకటిగా పేర్కొని ప్రపంచ పుస్తక ప్రదర్శనలో ప్రదర్శించిన 'ఇపుడు వీస్తున్నగాలి' ని నిషేధించి ఉపకారం చేసింది. బూర్జువా రాజ్యాంగంలోని వైరుధ్యాలను, తన నిజస్వరూపాన్ని దాచుకోలేకపోయింది. 'రామాయణ కల్పవృక్షం అత్యాధునిక కావ్యంగా భావించే ముఖ్యమంత్రిగారికి, భూసంస్కరణలకు ప్రాతిపదిక వాల్మీకి రామాయణంలో వెతుక్కునే ముఖ్యమంత్రిగారికి 'ఇప్పుడువీస్తున్నగాలి' రంగు, తీవ్రత, బలం, రూపం ఎలా అర్థమవుతాయి? సెక్యులర్ రాజ్యాంగాన్ని (?) భగవద్గీతగా, ఖురాన్‌గా వర్ణించే మహానుభావుని ముక్కుపుటాలను మాత్రమేకాదు గుండెలనుకూడ శ్రామిక శ్రేణియో రాజ్యాన్ని స్థాపించడానికి 'ఇపుడు వీస్తున్న' పీడిత రైతాంగ సాయుధ పోరాట గాలులు తప్పకుండా బద్దలు చేస్తాయి. పుస్తకాలను నిషేధించి ఇపుడువీస్తున్నగాలిని అరికట్ట గలననుకోవడం అవివేకానికి పరమావధి.

విరసం యూనిట్
వరంగల్.

SRJANA Telugu Monthly  August '72  Regd. No. H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67



84 Pages  Re. 1/-